ప్రథమ ముద్రణ — 1943
ద్వితీయ ముద్రణ — 1946

## గ మ ని క

ఈ నాటకముయొక్క సర్వహక్కులూ నాకు చెందియున్నవి. ఈ నాటకమును మొత్తముగాగాని, ఇందలి భాగములనుగాని, పద్యములనుగాని. పాటలనుగాని, యెవ్వరునూ వ్రాతమూలకమగు నా అనుమతిలేనిది ప్రచురింపగూడదు; ప్రదర్శింపగూడదు, ఫిలిం తీయగూడదు; రికార్డింగు చేయగూడదు; బ్రాడ్‌కాస్టింగ్ చేయగూడదు, మరేవిధముగానూ నా హక్కులకు భంగము గల్గింపగూడదు.

అట్లు చేసినవారు నాచే కోరబడు నష్టపరిహారమునకును, నాచే జరుపబడు సివిల్, క్రిమినల్ చర్యలకును బాధ్యులు.

తెన్నేటి సూరి,
సర్కిల్‌పేట - మచిలీపట్టణము

రు. 1—8—0

# అంకితము

నా జనకులు

సంగీత సాహిత్య విద్యావిశారదులు

శ్రీ శ్రీ శ్రీ తెన్నేటి తిరుమలరాయమంత్రికి

షష్ఠిపూర్తి పాదపూజ

# ప రి చ య ము

## క థా వ స్తు వు

హర్షవర్ధనుని నామము భారత చరిత్రయందు సువర్ణాక్షరములతో వ్రాయబడియున్నది. 6 వ శతాబ్దమున, ముక్కలుముక్కలై వినాశదశ నొందిన భారతభూమిని, ఖడ్గముచేపట్టి, ఒకేయొక కేతనముక్రిందికి నడిపించి, హైందవసామ్రాజ్యమును పునః ప్రతిష్ఠించిన కర్మవీరుడు - హర్షుడు. ఉత్కృష్టమగు ఆ ఘట్టము ఇందుల్లేఖింపబడినది. భారత జాతీయోద్యమములయందు, భారత వీరనారీమణులు, అదినుండియూ, ముందునడుచుచునేయున్నారు. కమాలా, రాజ్యశ్రీలు భారత వీరనారీమణు లకు ప్రతిబింబములు. కనుక యితివృత్తముయొక్క విశిష్ఠతనుగూర్చి సందేహములేదు.

## చరిత్రాంశముల మార్పులు

రససిద్ధికొఱకు, నాటక ఘటనా సౌలభ్యముకొఱకు, పాత్రల యౌచితికొఱకు, చరిత్రాంశములు చాలవఱకు తారుమారు చేయబడినవి. సహృదయులు మన్నింతురుగాక!

## శ శాం క చ క్ర వ ర్తి

ఇట్టి పాత్ర ఆంధ్రనాటకరంగమున లోగడలేదు. ఈ పాత్రను ప్రదర్శించునపుడు నటకుడు మున్ముందు చక్కగా పాత్రయందలి మానసిక తత్వమును అవగతము చేసికొనవలయునని హెచ్చరించు చున్నాను. ఈ పాత్రనుగూర్చి ఇచ్చట విమర్శింపబూనుటకు అవకాశము లేదు. అదిగాక, అది నాపనిగాదు — నటకుని బాధ్యత, విమర్శకుని యుద్యోగము.

## శి ల్ప ము

సమవాకారము.

## ద్వితీయముద్రణ : మార్పులు

దేశమున గల్గిన గానకళాపరిణామము ననుసరించి గేయములు కొన్ని మార్చబడినవి. గమనింప ప్రార్థన.

తె. సూ.

# ఆశీః

## 'వాగ్గేయకారకరత్న' బ్రహ్మశ్రీ హరినాగభూషణముగారు

శ్రీ సూరిగారూ !

'నారాణి' యను మీనాటకమును, నే నామూలాగ్రమమితోత్సాహముతోఁ జదివితిని. 'కావ్యాలాపాంశ్చవర్జయే' త్తనెడి న్యాయము ననుసరించి నాటకాది శృంగార కావ్యరచనలఁ జదివెడి రసికత బాల్యము నుండియు నాయందు సహజముగఁగొరవడియున్నది. కాని యీ మీ నాటకము (ఇది నాటకమనుటకంటె నాటికయనుట మేలని నాకుఁదోచెడిని); దీనిని జేతఁబట్టినదిమొదలు, అంతమగువరకునూ నాకుఁగలిగిన పఠనోత్సాహమును, అప్పుడప్పుడు జనించిన పులకాంకురానంద బాష్పములును, దీని యుత్తమత్వమును జాటుచున్నవి. నేను బి. యే., విద్యార్థినై యున్నపుడు చదివిన శ్రీ షేక్సుపియరు మహాకవి రచితమగు 'సింబలీను' అను నాటకరాజము, నాస్మృతిపథమునకుఁ దెచ్చినది మీనాటిక. ఇందలి రచనాచమత్కృతి, రసపోషణా చాతుర్యము, వస్తుప్రకాశన సామర్థ్యము, మున్నగు రూపక కవితాసామగ్రి 'అంతగ' శోభించుచున్నవని నాభావము. చరిత్రాత్మకమగు నీ నాటకవస్తువు దేశకాలానుగుణ్యమగు నవ్యభావ విన్యాసముతోడ బాత్రౌచితీ సమగ్రముగఁ బోషింపఁబడి వెలయింపఁబడినది. ఇందు వీరశృంగారములు స్థాయీభావము నొందినవై కన్పట్టెడిని, ప్రాచీన సాంప్రదాయముల ననుసరించిన పాతివ్రత్యము నవీనభావానుగుణ్యమగు స్త్రీపరాక్రమాది సన్నివేశముగలదయి విరాజిల్లునట్లు గుదిగూర్చఁబడియె, ఇందంతఃప్రవాహ గుంభితములగు నభినవ రాజనీతి, రాజ్యతంత్రవిధానములు జాతీయభావోన్మేషమునకు దోహదమొనర్పఁగలవు. తమ గద్యపద్య గీతారచనము ప్రాచీనాధునిక భావసమ్మిళితమై ప్రాయశః సుగమమై, లలితమై, ధారాశుద్ధిమై వలరారెడి నవియే చెప్పనొప్పును. మీరు వయసునందు చిన్నలయ్యుఁ బెద్దలకేని యందరానియిట్టి నాటికను రచించినందుకు నాబోటి వయోవృద్ధున కాశీః పాత్రులగుచున్నారు.

## ఆంధ్ర పత్రిక

'వారాణి' అన్న నాటకము బహు పొంకమైనది. ఉదాత్తమైన కవితా, నిగ్గయిన ఇతివృత్తం, యోగ్యమయిన సంభాషణలూ కలిగిందీ నాటకం, రంగంమీద రక్తికట్టినది కూడాను.

## కృష్ణా పత్రిక

సూరిగారు యువకులు అయినా, పెద్దలకుమించిన ఊహాభావాలు కలవారు. భాషలో చక్కని పాండిత్య ప్రకర్ష కనుపిస్తుంది. చరిత్రాత్మకమైన ఒక సన్నివేశాన్ని తీసుకొని వీరు యీ నాటకాన్ని రచించారు. ఈ నాటకం నడకలో, బాషలో ముందంజవేయడమే లక్ష్యంగా పెట్టుకొన్నదని చెప్పగలం. సూరిగారి పద్యాలు బాగా వుంటాయి.

నాటకం అందరు చదివి, ఆడి, పాడి, ఆనందించతగ్గది.

## ఆంధ్ర కేసరి

ఈ నాటకము చదువుతుంటే భారతజాతిలో పుట్టాననుకునే ప్రతి భారతీయునకు ఒళ్లగగుర్పొడిచి, నాళాలలోవున్న రక్తంవేడెక్కి, గంభీరమైన వేగంతో పరుగులు తీస్తుంది

## శ్రీ డాక్టర్ కుప్పా వెంకటరామశాస్త్రిగారు, ఎం. బి., బి. ఎస్.

"కవులు కర్మవీరులు; కలమునేగాదు, ఖడ్గమునుగూడా నడిపించ గలిగియుండాలి" అనే తమ భావానికి బాణుని రూపమున ఒక ఆకృతిని కల్పించారు నాటకకర్త....

రసమున కనుగుణ్యంగా భాష పరువులెత్తింది.

శృంగారఘట్టములలో కోయిల స్వనమువలె మధురంగా లాలిత్యముతో నడిచింది. హర్ష-బాణుల వాక్కున, గంగావాహినివలె గంభీరముగ ప్రవహించినది. వీరఘట్టములలో కొదమసింగమువలె గర్జించింది.

## శ్రీ వి. ఆర్. కె. సోమయాజిగారు, ఎం. ఏ., బి. ఎల్.

"అన్యదేశీయున కసువులనైన నర్పింతుగాని, యీ భారతభూమియం దడుగిడనీయ"నని రణోన్ముఖుడగు హర్షవర్ధనుని వాక్కులు నూతన సందేశము నొసంగుచున్నవి. చరిత్రాత్మకమైన యీ చిన్న నాటకము 'యశోవా మృత్యుర్వా' యను సూక్తి నుద్ఘోషించుచున్నది.



## — పాత్రలు —

### —: పురుషులు :—

గ్రహవర్మ

హర్షవర్ధనుడు

బాణుడు

శశాంకచక్రవర్తి

ఉగ్రసేనుడు

తోరమాణుడు

### —: స్త్రీలు :—

రాజ్యశ్రీ

కమల

సేవకులు, వైతాళికుడు మొదలగువారు

# నాంది

కొసలు విచ్చులు కొన్న క్రౌంజాయ సంజ రే
ఖలు కొప్పుకొన జిల్గుతళుకు లీన,
తంత్రీస్వనంబుల తరితీపు లొలికిపో
అజారాణి కచ్ఛపి, నవఘుణింప,
కలుములచెలువ చొక్కపు మంజు గానాల
దశదిశల్ పులకించి తన్మయింప,
అలరువిల్తునితంత్రి యలఘు మార్దంగిక
ధ్వానాల, గోళాలు, ఫల్లవింప,

అల్ల పరమేష్ఠి తాళంబు నందుకొనగ
తనదు మునివ్రేళనంతపథంబునందు
సృష్టినివెలార్చ. నటియించు శివకరుండు,
అల్ల నటరాజు మనకు సాక్షాత్కరించు !!!

# “ నా రా ణి ”

## ప్రథమాంకము—ప్రథమ రంగము

(స్థానేశ్వరము ఉద్యానవనము — ప్రవేశము గ్రహవర్మ)

గ్రహవర్మ: నాతో.........ఎన్నడునూలేని ఈ మహానానంద తరంగము లేమి!

గీ॥ ప్రియతమ వియోగమారుత వికలహృదయ
నీలనీరద శకలము లేలగలిసె!
మందువేసవి తడియారు, మామకీన
హృదయ తలమున చన్మపెల్లెల యుదికె!

సకాలాగత మాయెనా! అమృతము వర్షింపగలదా! రాజ్యశ్రీ కానుపించి యెంత కాలమయినది. పాపమామె మా యిరువురి తోడనూ, చంద్రసూర్యుల నడుమ ఉషఃకన్యవలె నడయాడు చుండెడిది. హర్షవర్ధనుండామెను తరచు చూచుచునే యుండ వచ్చును. రాజాంతఃపురములందీ నిబంధనము లేమిటికో?.... కాదు కాదు. ఆమెకేమి నిబంధనము....ఆమెను చూచుటకు వీలు లేకుండ నిరోధింప బడినవాడను నేను.

రాజ్యశ్రీ: (తెరలో)

ఈ నవోదయవేళ నిన్నెవరి కొఱకు
పంచమ స్వరమందున పాడుచుంటి
విదిగో! కన్నెత్తిచూడు! నీ హృదయసీమ
నంటి, అంటక యుండిన యట్టి ముగుద॥

గ్రహవర్మ: (ఆలకించి) నవరసాలకిసలయాస్వాదనాప్రమత్త పికీవిస్వనంబున నీగీతి నాలాపించిన వారెవ్వరు? (ధ్వని వినవచ్చినదెస జూచుచుండును)

రాజ్యశ్రీ : (తెరలో)

పీడు గానము వినిన ప్రమోదమందు
ఈ పికాంగన మరచితివేమొ యపుడె ?

గ్రహవర్మ : (తనలో) ఆమె నా మనోజరాజ్యలక్ష్మి రాజ్యశ్రీ, నే నిపు డామె కెదురుపోయి మాటాడింతునా? సిగ్గున.... వెనుదిరిగి పోవు నేమో....

రాజ్యశ్రీ : (తెరలో)

నవయువతి భర్త గన్గొని నానజెంది,
యాననము వంచినను ప్రేమ యడగుచేమొ ?

గ్రహవర్మ : నేనీ కుంజసదనమున దాగియుండి, యా దివ్యమంగళ విగ్రహమును కన్నులార జూతును. (దాగికొనును)

రాజ్యశ్రీ : (తెరలో)

ఇట్లు ప్రతిమాలి వచ్చితి వింక కలహ
మేమిటికి? పత్రముల దాగుచేటికయ్య ?

గ్రహవర్మ : నా రచించిన ఈ 'పికీవిలాప గీతికలు' రాజపుత్రి మధుర కంఠము నుండి వెల్వడి సార్థకతను పొందుచున్నవి.

(ప్రవేశము : రాజ్యశ్రీ, కమల, ఒండొరుల చేతులుపట్టుకొని)

రాజ్యశ్రీ :

కమల జొండంబునందు చీకటులువాప
సూర్యదేవుండు సనుదెంచె చూడవేమి ?
తోటి పిక మిథునంబు సంతోసమంది
స్వాగతముల నొసంగె రపంతగనుము॥

[ఆసీను లగుదురు]

కమల : భర్తృదారికా ! యా గీతములు రచించినది, నీ వేనా !

రాజ్యశ్రీ : నేనుకాదు.... వాన

కమల : ఎవరైననేమిగాని.... మిగుల శ్రావ్యముగనున్నవి.

రాజ్యశ్రీ : అవును కమలా! మా బాలకవి చంద్రులునూ, అట్లేయని నారు....

గ్రహవర్మ : (తనలో) రాజపుత్రీ, నీ విమర్శనము గూడ నదువరాదా!

రాజ్యశ్రీ : తోటి పికమిధునము స్వాగతము అర్పించెననుటయందు, ఆపికాంగనయందు, అసూయాభావము పోషింపబడుచున్నది, చూచితివా :

కమల : అతనికి దానియందు అంత సారస్యము కాన్పించెనో లేదో కాని నీకు బాగుగా బోధపడినది.

గ్రహవర్మ : (తనలో) కాదు కాదు కమలా! నేనది వ్రాయునపుడు గోచరముకాకపోయినను, యిప్పుడు బాగుగా గ్రాహ్యమగు చున్నది....

కమల : మీ గ్రహవర్మ బావగారు చాల మంచివారు; చక్కని అందగాడు; కాదూ ?

రాజ్యశ్రీ : అందమున కేమిగాని, అతడు చాల మంచివాడు. నేననిన, నతనికి చాలప్రేమ. మా చిన్నితనమున మే మొకరినొకరు క్షణమైనను విడువకుండ నుండెడువారము....(స్ఫురితయై) అయినమా కమలా ! మనకీ పురుష ప్రసంగము లేమిటికే ?

గ్రహ : (తనలో) అతనికి నీయందు ప్రేమ నిజము. నీకాతనియందు లేదా ?

కమల : ఆఁ! .... పరపురుష ప్రసంగములు దోసములు గావి... ఆఁ అమ్మా! నీ మనమున నీవిప్పుడేమనుకొనుచున్నావో, తెల్పుదునా! వరుల మనములందేమి యున్నదో తెలిసికొనుటకు నాకొక మహాత్ముడు, ఒక మంత్రమును బ్రసాదించియున్నాడు, నా మంత్ర శక్తిని జూపుదునా !

రాజ్యశ్రీ : మంత్రమును నేర్చుకుంటివో లేదోగాని, టక్కరిమాటలు పెక్కు నేర్చుకొంటివి. అయిననూ చెప్పుము చూతము!

కమల : 'నేను కోసలకు రాణి నెప్పుడగుదునా' యని యనుకొను చున్నావు. నీవు కోసలకురాణివైన నాకేమి బహుమానముజేతువు?

రాజ్యశ్రీ . (తనలో) ఈమె నాహృదయమెట్లు గ్రహించినది. (సిగ్గున కలవంచుకొనును)

గ్రహ : (తనలో) కమలా ! నేను నీకొకయూరు బహుమానమొసంగె దను:

కమల : అమ్మా ! ఇప్పుడు తేటతెల్లమైనది. నావద్దనా సిగ్గుపడుట ? ....నీవిటులనే యుండుము. నేనతనిని నెమ్మదిగా నిచ్చటికి దీసి కొని వత్తును. (పోబోవును)

గ్రహ : (తనలో) కమలా ! దూరముపోవ బనిలేదు.

రాజ్యశ్రీ : (వారించి) వలదు వలదు కమలా ! నీవు నా మనోనాథు నిచ్చటికేమని చెప్పి తీసుకొని రాగలవే !

కమల : ఏమనియా ? అమ్మాయి, హర్షవర్ధనుడుగారూ, ఉద్యానవనమున నున్నారు, మిమ్ములను త్వరగా రమ్మనినారనిచెప్పి——

రాజ్యశ్రీ : నీ కల్లమాటల నాతడు నమ్మునా ?

కమల : నమ్మకేమి....అయిన నొక లేఖ వ్రాయరాదా ? పత్రమును గంటమును దెత్తును. (పోవును)

రాజ్యశ్రీ : కమలా ! ఒత్తుపకొక పొత్తముగూడ దెచ్చెదవా ?

గ్రహవర్మ : (కుంజవనమునుండి వెలుపలకువచ్చి)

చక్కగా వికసించిన సారసంబు
పవన బాలల తేటికై బంపనేల ?
ఇపుడు తాపక మానసంబెరిగి యితడు
బాసటనెగల్గ ఈ రాయబారమేల ?

రాజ్యశ్రీ : (లేచి) కమలా ! కమలా !

గ్రహవర్మ : (వెనుకనుండి యామె కరద్వయమంది) రాజపుత్రీ ! మెల్లన వీతెంచు ఈపిల్లవాయువులు నేడేలకో చలువగుణము వీడి గ్రీష్మాతపముల కైపడి నిప్పులు చెరగుచున్నవి. నీ శీతల దృక్ప్రచారమున నా హృదయ తాపము నొకింత దీర్పుము, బ్రతి మాలి కొందను,

(రాజ్యశ్రీ ఆకంపిత గాత్ర)

గ్రహ :

ఆసమీర, పవను సంపి, భర్త్సనుబిల్చి,
తత్కరాంతయోగ తామరసము.

కదలుభంగి, ఇట్లు కంపింతువేటికి?
చకిత బాలహరిణ చలిత నయన!

రాజ్యశ్రీ : ఆర్యా! మాయన్నగారున్నారుకదా!

గ్రహ : సుక్షత్రియులకు గాంధర్వము విధిచోదితము. ఇందు మీవారి పనియేమున్నది? రాజవదనా! యిక మారాడకుము.

[అనుబంధము-1]

(రాజ్యశ్రీ గ్రహవర్మలు ఆలింగనోత్సుకులు)

(వృక్షముల వెనుకనుండి లేచి నిలచి హర్షవర్ధనుడు దంపతులపై పుష్పములు చల్లుచూ)

హర్షవ : (స్వగ) నేడుగదా! స్వర్గస్థులైన మాయత్తమామలకును, తలిదండ్రులకును మనశ్శాంతి గలిగినది.

గ్రహ : (ఆశ్చర్యముతో) యీ పుష్పము లెచ్చటనుండి వచ్చినవి?

రాజ్యశ్రీ : (సిగ్గుతో)నన్ను విడువుడు; మా హర్షన్నయ్య.

(హర్షుడు ముందునకు వచ్చును. రెండవ వైపునుండి బాణుడు, కుసుమ మాలికలతో కమల ప్రవేశింతురు)

గ్రహ : మహామంత్రిగారికి నమస్కారములు,

బాణుడు : కుమారా! నిఖిల భూవలయ భారవహన మహనీయుడగు చక్రవర్తివి గమ్ము!

రాజ్యశ్రీ : బాబా! నమస్కారము!

బాణుడు : తల్లీ నీవిభుడనన్య సామాన్య సద్గుణ సంపత్తి కలవాడు. మీరు చిరాయువులై సుఖింతురుగాక!

కమల : (ఎకసక్కెముగా) గాంధర్వమైనను, కుసుమమాలికలు ధరించినంతమాత్రమున దోసములేదు లెండు.

(కమల చెరి యొకరికి చెరియొక మాలను యివ్వగా వండొరులు అలంకరించుకొందురు) (అనుబంధము. 2)

[యవనిక]

# " నా రా జి "

## ప్రథమాంకము — ద్వితీయ రంగము

[ ఇది విష్కంభము ]

( ప్రవేశము వైతాళికుడు )

వైతా : (గేయములు)

1

మందార ముకుళముగ్ధా కపోలములపై
కెందామరలపామి కెంపు ముద్దులె హత్తి
ఎందాక ఈనిదుర లెనసెదవు లేవోయి ;

లేవోయి నీ నిదుర
రావోయి రణమునకు

వీర భరత కుమార ధీర రణశూర.... ఇక ॥లేవో॥

2

వెలుగులోవికిరండు వెలివిరిసినది కాంతి
నవ్యప్రరోచిలో నాట్యమే పేతాము—
క్రొత్తపువ్వులు గిల్లుకొని తెచ్చుకుందాము
విజయగీతికలల్లి విరజిమ్మి వేతాము—
జయదుందుభులుమ్రోయ చలరేగి కదనాన
ప్రళయతాండవకేళి వరుగుల్లు వెట్టంగ—

లేవోయి నీ నిదుర
రావోయి రణమునకు

వీర భరత కుమార ధీర రణశూర.... ఇక ॥లేవో॥

## నా రా జి

(ప్రవేశము సేవకుడు)

సేవ : వైతాళిక మహాశయా! అంతఃపురవాసులందరును మేలుకొనియే యున్నారు. నీ మేలుకొలుపులనిప్పుడు ప్రారంభించితివేమి!

వైతా : కొంచమాలస్యమైనది——

సేవ : హర్షచక్రవర్తి స్వయముగ సైనికశిక్షణను అరయుటకు బయలు దేరుచున్నారు. రాకుమారియూ, కమలాదేవియు మృగయావినోదార్థము అరణ్యమునకు పోవుచున్నారు.

వైతా : మహామంత్రిగారిని నేను సందర్శించుకొనవలయును. అవకాశము లభించునా ?

సేవ : మహామంత్రిగారును, గ్రహవర్మ మహారాజుగారును కోసలరాజ్య విషయములను గూర్చి సమాలోచించు చున్నారు. వారి దర్శన మిప్పుడు లభింపదు........ నేను త్వరగా అశ్వపాలకుని కలిసికొనవలయును: పోయివచ్చెదను.

(నిష్క్రమణము) [యవనిక]



"నా రా ణి"

## ప్రథమాంకము—తృతీయ రంగము

[వనప్రదేశము—బాణ బాణాసనములను, కవచాదులను ధరించి, రాజ్యశ్రీ కమల ప్రవేశము.]

రాజ్యశ్రీ : కమలా! గంభీరమగు నా హృదయమును సైతము స్వాధీన మొనర్చుకొనునది, ప్రణయాధిదేవత - నన్నొక పసిపాపను జేసి వైచితన చిటికెనవ్రేలు నాకొసంగి, తనయిచ్చవచ్చినట్లు ప్రేమోద్యాన భూముల సంచరింపజేసినది. ప్రణయాధిదేవత, ఆయుద్యాన భూమియందు, ఆ కుసుమ విసరమునందు, మేను పులకించుకొని, తన్మయత జెందితిని - ప్రణయాధిదేవతాప్రభుత్వము నిరంకుశమైనది. అదియే యీ జగత్సృష్టికి మూలకందము. అట్టి పవిత్ర మూర్తికి, అరమోడ్పు కనులతో అంజలింపుము కమలా! జోహారు లొనరింపుము.

కమల : (నవ్వుచు) ఆహా హా! వెనుకటి శాస్త్రము నిజమైనది. అందుచేతనే మనువు ఆడుదానిని నెత్తిపై మొట్టి, అంతఃపురము పాలుగమ్మని అనుశాసించివైచినాడు. కత్తిబుచ్చుకొని సింహశార్దూలాదులతో కయ్యమునకు వచ్చి, ప్రణయ భాగ్యములకొరకు కలువరింప సాగితివేమి?—

లలితములైన పల్కులు, కలక్వణ నిక్వణ కంకణంబులున్
పలునయగారముల్, ప్రియుల భాషణముల్, తగుముచ్చటల్ సిరుల్
లలనల కొప్పుగాక; మగరాయని వీర ధనుష్కృపాణముల్
కలికి ధరింప బూనినను గౌరవహానియెగాదె వానికిన్.

మగని జూచుకొనినగాని నీ మనసు నిలచునట్లులేదు. పద పద - కొంపకు బోదము! యీ కత్తి, కటారి మీ యాయన కొప్పగించి, యిల్లుదూరి, తలుపు మూసుకొని పెండ్లిపాటలు, పెనిమిటిమాటలు ఇక ఈ - ఉబుసు పాడుకొనవచ్చును.

రాజ్యశ్రీ : ఆ! ఆ! కమలా! రాజ్యశ్రీ మనస్థైర్యములేని మందబుద్ధి యనుకొంటివా!

కమల : లేదు, లేదు, బలవంతురాలు, శౌర్యవంతురాలు, చండశాసను రాలు అగు అబల యనుకొంటిని.

రాజ్యశ్రీ : అదియే నా కసహ్యము. అబల యను పదము స్త్రీజాతికి నామముగా జేసి, శాస్త్రకారులు వారి నెంతయు ఘోరము జేసి పైచిరి. నీవునూ నా కట్టి అన్యాయమునే జేయుచున్నావు. ఆడుది అబలకాదు ఆడుది సత్వము, ఆడుది తెగింపు, ఆడుది అబల యెట్లయినదే కమలా?

కమల : ఆఁ....క్షమింపుము....మాతల్లి.....,నన్ను చెంపమీదకొట్టి, నేనేడ్చిన తానేడ్చి, తన్ను తా తిట్టుకొనియెడిది?

రాజ్యశ్రీ : అదియు సత్యమే, స్త్రీ దయామయి. అంతమాత్రమున నిర్వీర్యయా?

కమల : ఆఁ....అది సరికాని.........

రాజ్యశ్రీ : కాని....

కమల : పోనిండు. తమకు కోపమువచ్చునేమో!

రాజ్యశ్రీ : చెప్పవలయును, ఇది ఆజ్ఞ!

కమల : ఆడుది తెగబడి, అడవులవెంట దిరుగజొచ్చిన, సంఘము నిరసింపదా? యని నా సందేహము.

రాజ్యశ్రీ : అడుగవలసిన ప్రశ్న నడిగితివి కమలా! ఉన్నతిని ఈ సంఘమెప్పుడునూ నిరసింపుచునే యుండును. ముందొక పవిత్ర వ్యక్తి యీ పాడుసంఘముకొరకు ఆత్మార్పణ మొనర్చినగాని యీ సంఘమునకు బుద్ధిరాదు. తరువాతగాని దానికన్నులు మూతలు విడవు. సత్పథము దానికి గోచరింపదు. అయినను కమలా! సంఘము నిరసించునని జంకిపోవుటకు రాజ్యశ్రీ చపల చిత్తమ్మకాదు.

## హా రా జీ

(ప్రవేశము:. రెండవవారుగా. శశాంకచక్రవర్తి, ఉగ్రసేనుడు.)

శశాం : (జనాంతికము) ఉగ్రసేనా! వీరు.... దేవతలు కాదుగద!

ఉగ్రసే: (జనాంతికము) మహారాజా! ఆశ్చర్యమే!

కమల: భర్తృదారికా! మన్వాదులు, పాపమట్లు తెలివితక్కువపడినారేమో?

రాజ్యశ్రీ: వారు తెలివితక్కువవారని కాదు నావాదన, ఆ కాలమునకు సరిపోవునట్లు వారు సాంఘిక నియమములు నేర్పరచిరి. అవి యీకాలమునకు పనికిరావని నా యభిప్రాయము. అట్లయిన ప్రాచీనకాలమున మనము కోతులముగదా, యిప్పుడు మనుష్యులుగా నేలయుండవలయునే కమలా? .... ఎవరో పురుషులు!

శశాం: మాకు నేడు దేవవనితా దర్శనమైనది. మేముధన్యులము.

రాజ్యశ్రీ: కృతజ్ఞురాలను! అట్లనవలదు. దేవవనితలు మాకు పూజనీయలు

శశాం: నామధేయము?

కమల: మా రాట్కుమారి పేరు....రాజ్యశ్రీ

శశాం: స్థానేశ్వర రాకుమారి?

రాజ్యశ్రీ: ఔను! తమ నామధేయము తెలిసికొనవచ్చునా?

ఉగ్రసే: మా చక్రవర్తి, శ్రీమద్రాజాధిరాజ, రాజరాజ నరేంద్ర శశాంక మహారాజులు.

రాజ్యశ్రీ: వంగదేశాధిపతులా? పెద్దల దర్శనమైనది.

కమల: (ఉగ్రసేనుని దిక్కై) ఖడ్గము దీర్ఘముగా నున్నది....తమరు ....దండనాధులవలె నున్నారు.

ఉగ్రసే: (ఆశ్చర్యముతో) చిత్తము.

శశాం: రాట్కుమారీ!

రాజ్యశ్రీ: ఆర్యా?

శశాం: మేము....చక్రవర్తులము.

రాజ్యశ్రీ: చిత్తము, మొదటనే సెలవిచ్చితిరి గదా! తెలిసికొంటిని! తమరు గౌరవనీయులని యెరింగితిని.

శశాంక: మేమొకటి యాచింతెదము.

రాజ్యశ్రీ : చక్రవర్తి....యాచించుట....ఆశ్చర్యము !

శశాం : నేను త్వదీయలావణ్య ముగ్ధుడను. తృష్ణాపీడితుడను.

రాజ్యశ్రీ : (చెవులుమూసికొని) హరీ హరీ ! బెడిదంపు ములుకులు: కర్ణపుటభేదనములు, దుస్సహములు, కఠోరములు ఈ పలుకులు (చీకాకుపడును)

కమల : (జేవురించిన మొగముతో) మా రాట్కుమారి వివాహిత.

శశాం : (తీక్ష్ణముగ) ఈ అర్థించువది చక్రవర్తి.

రాజ్యశ్రీ : దీని యర్థమేమి ?

ఉగ్రసేన : ఏబదిలక్షల సైన్యము దాని యర్థము !

కమల : ఐన నేమాయె ?

శశాం : ఏమాయె ? మహాసంగ్రామము....రక్తప్రవాహము ....కారాగార వాసము....బలప్రయోగము....మానభంగము....ఏమాయె ?

రాజ్యశ్రీ : శశాంకా ! యిది భారతదేశము !

ఉగ్రసే : ఆఁ ; అంత అహంకారమా !

కమల : పశువా ! వదరకుము.

శశాం : ఉగ్రసేనా ! చూచెదవేమి ?

(బంధించుకొని రమ్మని వంజ్ఞచేసి చరచరా నిష్క్రమించును)

కమల : (కత్తిదూసి; ఉగ్రసేనుని దిక్కై) రమ్ము, రమ్ము! చండతర మైన నాకృపాణమున కెరజేసెదను రమ్ము.

ఉగ్రసే : (కత్తి భుజముపై బెట్టుకొని) మీరు మా ఖైదీలు నడువుడు.

రాజ్యశ్రీ : (అర్ధచంద్రాకారముగనున్న బాణమును వింట సంధించి, ఉగ్రసేనుని శిరమునకు గురిపెట్టి) ఎవరు ఖైదీలు ?...కాలు కదపితివా జాగ్రత ! నీ శిరమును ఖండించి వైచెదను, పడవేయుము: నీ ఖడ్గమును క్రిందపడవేయుము. పడవైచెదవా ! లేదా ?

(స్తంభీభూతుడయి ఆయుధమును క్రింద వైచును )

రాజ్యశ్రీ : ధూర్తులారా ! మహిళా మండలి పాదరి, అధోగతి పాలై యుండ, వారికి జేయూత నొసంగుటకుమారు, మీరిదియా చేయ

వలసినది. గంభీరలము, బాణబాణాసన సమాయుక్తలముగాన సరి పోయినది. ఇంకొక స్త్రీ నేడిట్లు చిక్కువడియున్న మానభంగము నొందవలసినదేనా ? ధనుః పాండితీ పతిష్ఠయగు రాజ్యశ్రీకి సయి తము క్షేమము లేనప్పుడు యింకేస్త్రీకి క్షేమము కలదు. మీవంటి నీచాతినీచులు కలుగుటచేతనే యీ నా భారతభూమికి ఇట్టిఇక్కట్లు కలిగినవి. రక్కసీః నీ శిరమును ఖండించి వైచెదను. కాదుకాదు. పవిత్రమైన నా ధనుర్నిగమము త్వదీయ తుచ్ఛరక్త ప్రసారమున కళంకీభూతమగును. కమలా ః వీని గౌరవ చిహ్నములను హరింపుము.

కమల : (ఉష్ణీషము, పైవస్త్రము, ఆయుధములు గైకొని) భర్తృ దారికా! చిత్రవర్ణములుగల యీ రత్నాంబరము నాకిచ్చెదవా ? మా చిట్టిచెల్లెలు వల్లెవేసుకొనుట కిచ్చెదను, ఆమె మిగుల సంబర పడును.

రాజ్యశ్రీ : వెనుదిరిగి పొమ్ము! దూర్తుడా, (బాణమువంక చూచుచు ఉగ్రసేనుడు నిష్క్రమణము)

కమల ; సృష్టి వైచిత్ర్యము. స్వల్పసత్వ పీడాకరంబులగు బలంబులు బహుబల సమన్వితుల చెంగట తలలొగ్గుచుండును. సత్వభూజ వినాశకరంబగు మత్తేభము, పంచానన ఘోరనఖర విదారిత మస్తకస్థలయగునప్పుడు శౌర్యవిహీనయగును.. ఈతులువలీదినము మన మృగయా వినోదమున కంతరాయము కలిగించిరే!

రాజ్యశ్రీ : బుద్ధిలేని క్రూరమృగముల వేటాడుటకన్న పితామహ దత్త మగు పవిత్రమానసము కలిగియు దుష్పృధగాములగు నరపశువుల వేటాడుటయే పరమాహ్లాదకరము దౌష్ట్యమును సహింపని వెలి వున సూర్యదేవుడు తైక్ష్ణ్యమును వహించుచున్నాడు. కాలాతీత మైనది. గృహోన్ముఖుల మగుటమంచిది. అశ్వముల నధిరో హింతము పద.

(ఇరువురూ నిష్క్రమింతురు — యవనిక)

"నా రా ణి"

## ప్రథమాంకము — చతుర్థ రంగము

[ కాశీపట్టణము—శశాంక చక్రవర్తి ఆలోచనా మందిరము ]

( ప్రవేశము — శశాంక చక్రవర్తి )

శశాం : సిగ్గు సిగ్గు. వంగచక్రవర్తి. మహారాజాధిరాజ రాజరాజనరేంద్ర శశాంక మహారాజు దండనాథుడు ఒక్క స్త్రీచే పరాభూతుడగుటయా!.... నా హృదయము అంపపుకోతల బడిపోవుచున్నది.... అది వాని పరాభవముకాదు, అది నా శిరచ్ఛేదనమే.... వాని మానమును హరించుటకాదు. నా ప్రాణమును హరించుటయే... దండనాథుడట? దండనాథుడు!! నా ధనాగారముపైబడి గాదెలోని పందికొక్కువలె, తెగదినుటకుగాని, వీనివలన ఏమిప్రయోజనము! ఇట్టి పిరికిపంద దండనాథుడా! ఎవడురా అక్కడ? .... .... (బిగ్గరగ) ఎవడురా! యీ బ్రహ్మాండ కుహరము బ్రద్దలగునట్లు బొబ్బపెట్టిననూ వీరు పలుకరూ? వీరు నాయాజ్ఞ పాలింపరా! వీరిని చీల్చివైచెదను.

సేవకుడు : (ప్రవేశించి) ఆజ్ఞ?

శశాం : (కోపముతో) ఆజ్ఞ.... పొమ్ము. ఆ పిరికిపందను, ఆ దండనాథుని నాయాజ్ఞయైనదని తోడితెమ్ము. రెండునిమిషములు వ్యవధి. త్వరగా రావలయును. తడసితివా! యిదిగో చూచితివిగా? (బల్లమీదనున్న కత్తిచూపును)

సేవ : (వెడలిపోవును)

శశాం : (వెకిలినవ్వు) రాజు దయారసమును చూపిన, దానిని గ్రహింపక యీ పశువులు బలహీనతగా పరిగణింతురు. దౌష్ట్యమును ప్రకటించిన దుష్టుడని యేడ్చెదరు? నిరంకుశుడనై ప్రతిభ నొందుటకు

కాలప్రయోగమే పరమసాధనము. ఉగ్రసేనుడు, నా పరాభవము నకు తగిన ప్రతీకారము చేయగలడా సరి, లేదా....వీనిని తల తీసె దను....ధర్మాధర్మములతో నాకు పనిలేదు. నా ప్రభుత్వమును ఈ ప్రపంచమున ఎవ్వడూ విరోధింపరాదు.

[ పరికరము — ఉగ్రసేనుడు ]

ఉగ్రసే : (నమస్కరించును)

శశాం : మావరహితమైన విన్నటి నీ ప్రవర్తనమునకు తగిన సమాధాన మిమ్ము. విచారించి శిక్షించెదము.

ఉగ్రసే : ప్రభూ!

శశాం : నీమనవ్నులతో పనిలేదు అమానుషమగు నీ ప్రవర్తనమునకు తగిన సమాధానము కావలయును.

ఉగ్ర : (ఆశ్చర్యముతో) అమానుష ప్రవర్తనము!

శశాం : అఁ అధికారగర్వమున దండనాధులకు జ్ఞప్తితప్పినది కాబోలును. స్ఫురణకుదెత్తునా? (లేచి నిలువబడి) దండనాధులోకయుల పరాక్రమింప, శక్తివిహీనులై చెంపలు వైచుకొనిరట. జ్ఞప్తికి వచ్చినదా?.......శిరోవేష్టనము, ఖడ్గము హరింపబడుచుండ దేబె మొగము వైచుకొని, చేతులు నులిపికొనుచూ, ప్రాణభీతిచే గడ గడవడంకిరట!....తమకు తెలియదుకాబోలును.

ఉగ్ర : అది....చేయిమీరిన కార్యమైనది. నేను నిర్దోషిని.

శశాం : అదుదాని విజృంభణమునాచుట వంగసామ్రాజ్యదండనాధునకు వంగసామ్రాజ్య మహాసౌధ మూలస్తంభమునకు, వంగసామ్రాజ్య కనకదండమునకు చేయిమీరిన కార్యమైనదీ?....తమరు దోషు లని నిర్ధరించితిమి—మరణదండన విధింపబోవుచున్నాము—ఏమైన చెప్పికొనియెదరా?

ఉగ్ర : కడుపు కక్కుఱితికి, తమ నిరంకుశ ప్రభుత్వమున, దండనాధ పదవిని స్వీకరించినప్పుడే, ప్రాణములకు తెగించి స్వీకరించితిని. చేపేత కావలెనని తెచ్చికొంటిని ప్రభూ! దానికిప్పుడు చింతింపను.

శశాం : అఁ!....తిరుగుబాటు చేసెదవా?

ఉగ్ర: లేదు చక్రవర్తీ! యిదిగో నాయధికార చిహ్నమగుయీఖడ్గమును తమ పాదసన్నిధిని సమర్పించుచున్నాను. స్వీకరింపుడు. శిక్షను విధింపుడు. తమ యాజ్ఞను పాలించెదను.

శశాం: మరణించుటకిచ్చగించెదరు?—

ఉగ్ర: స్వామీ! మరణించుటకెట్టి మందుడైన నిచ్చగించునా? విధి యని వార్యమై పైబడునప్పుడు, తలనొగ్గక, కర్తవ్యమేమున్నది.

శశాం: అట్లయిన నా పరాభవమునకు తగిన ప్రతీకారము చేయబోవు చున్నాను. ధర్మాధర్మ విచక్షణ పేయక, నాయాజ్ఞ పాలింపుము. నీతలగాచెదను.

ఉగ్ర: చిత్తము.

శశాం: అటు కూరుచుండుము. (యిరువురు కూర్చుండ) పుళింద నాయకుడు, తొరమాణుడు, ఉద్దండుడు....హర్షునకు గర్భశత్రువు.

ఉగ్ర: ఆ కొండజాతి నాయకుడు హర్షవర్ధనుకకేగాదు, హైందవుల కందరకునూ విరోధియే!

శశాం: ఇది అప్రస్తుత ప్రసంగమూ! అసంబద్ధ ప్రలాపమూ? మేమిప్పు డాతని సాయ మపేక్షింప బోవుచున్నాము.

ఉగ్ర: అమ్మో! భారత వర్షమంతయూ....

శశాం: ఆః నన్ను విరసించును. గొంతుపిసికి చంపును. తమరునాకు రాజనీతిగరుప నగత్యములేదు. ధర్మాధర్మ విచక్షణకిందు తావు లేదని నేను మొదటనే చెప్పియుంటిని, నాయాజ్ఞ పాలింతువా? లేదా?

ఉగ్ర: చిత్తము.

శశాం: నీవిప్పుడాతని నాహ్వానించి మాకడకు చేకొని రావలయును.

ఉగ్ర: మహామంత్రిగారు దీనికి సమ్మతింప రేమోయని నా యను మానము.

శశాం: ఊఁహూఁ....నీకును అదియే సందేహము కల్గినదా? ఔను, ఆవృద్ధజంబుక మెట్లును, దీనికి సమ్మతింపదు. (ఆలోచించి) ఊఁ గొంగడిలో భోజనముచేయుటకు గడంగినపుడు వెంట్రుకలకు

వెరువరాదు...... (వ్రాసియిచ్చి) సేనాపతీ! ఇదిగో రాజాజ్ఞ మహామంత్రిని తలదీయుము.

ఉగ్ర: (పుచ్చుకొనిచూచి, చకితుడుగును)

శశాం: సేనాపతీ! భయము వైచుచున్నావా?

ఉగ్ర: లేదు మహారాజా

శశాం: నాయాజ్ఞను పాలింపుము. లేదా, యిదిగో! (కత్తిచూపును).

ఉగ్ర: (వంగినమస్కారముచేసి ఆజ్ఞాపత్రముతో నిష్క్రమించును).

శశాం: ఉగ్రసేనా! (ఉగ్రసేనుడు ప్రవేశము) యీ కార్యము విగూఢముగా జరుగవలయును, మంత్రి శీర్షమును మాకడకంపి, తోరమాణుని తోడితెచ్చుటకు నీవు శీఘ్రముగా పయనమై పొమ్ము, వెనుకంజవైచితివా? జాగ్రత్త.

ఉగ్ర: (నిష్క్రమించును) (భయవిహ్వలుడై వెడలు ఉగ్రసేనునిచూచి, శశాంకుడు వెకలినవ్వు)

శశాం: ఈ నాహృదయశల్యములు పీగిపోలకుండిన బ్రహ్మాండ కటాహమును బద్దలు చేసెదను. లేదా! మరణించెదను.

(నిష్క్రమించును — యవనిక.)



# " నా రా ణి "

## ప్రథమాంకము — పంచమ రంగము

(స్థానేశ్వరము-రాజమందిరము—హర్షుడు. రాజ్యశ్రీ. కమల. ప్రవేశము)

**హర్షుడు :** సోదరీ ! నాతలిదండ్రులు చేయవలసిన కార్యము నేను చేయవలసి వచ్చినది. హర్షుడు ఇక యేకాకియై మనవలయును గాబోలును.

**రాజ్యశ్రీ :** నాకు తలిదండ్రులైనను. సోదరుడవైనను నీవే ; యిది సంతోష సమయముగాని చింతించుటకు తరిగాదు.

(బాణుడు. ప్రభాకరవర్మ—ప్రవేశము)

**బాణుడు :** కోసలపతీ ! యే మహాసామ్రాజ్యము ఒకప్పుడు శ్రీరామచంద్రులచే పాలింపబడి. రామరాజ్యమని జగద్విఖ్యాతమైనదో. నేడా మహాసామ్రాజ్యము నీకు హస్తగతమైనది. ప్రబలతరమైన భారమిప్పుడు నీ భుజములపై మోపబడినది. ధీరుడవై నిలువవలయు నగత్యము గల్గినది. బాణుడు నీ రాచకార్యములందిక జోక్యము కల్గించుకొనజాలడు. ఇదిగో ! నీయధికారము నీకు ఒప్పగించుచున్నాను. (కనకదండము నొసంగును) యౌవనమదంబుచే కలుగు తమస్స్వభావము. రత్నప్రరోచులకుగాని. దీపప్రభలకుగాని. చంద్రకిరణ ప్రసారములకుగాని. అభేద్యమై. అతిగహనమై పోవును....యిక లక్ష్మీవలన గల్గు మదము వార్ధక్యమున సైతము అంతరింపదు. విషయ విషాస్వాదనా ప్రభూతమగు మోహము. యెట్టి మంత్రంబులకును లొంగునదికాదు. రాజ్యకాలుష్యావలేపము స్నాన శౌచాదుల వలన దలంగ జేయరానిది. రాజ్యాధికార నిద్రాధి దేవత వేకువను సైతము మేలంకువ నందనీయదు. శాస్త్రజ్ఞాన జలంబుల నాప్లుషితంబయ్యూ. బుద్ధి, యౌవనోదయమున కళంకీభూతము కాకపోదు. యువకులదృష్టి బహిర్ధావళ్యమునకు పదాగమగుచుండును. సుడిగాలి.

ఎంతుటాకమువలె. యౌవనము రజోత్క్రాంతి నొందిన ప్రకృతి పురుషుని, తన యిచ్చవచ్చిన చోటికి గొంపోవును. నవయౌవనంబున క్రాగిన చిత్తంబునకు జలంబులవోలె విషయములు అనుభవించు కొలదియు, అతిమధురములై తోచును. సకల సద్గుణ రత్నాకరుండవగు నీకింతగా తెల్పవలయునని తలంపను.

గ్రహవర్మ : మహామంత్రులకు వందనములు. తమరు నాకొనరించిన యీ మహదుపదేశమును మరువజాలను. తమరు నా వెన్ను కాచి యుండెదనని వగ్దానము జేయవలయును. (గ్రహవర్మ చేయిజాప బాణుడు తనచేయి నందించును) పితృసములగు తమ్ము విడనాడుట కెంతయు చింతించు చున్నాను.

హర్షుడు : బావా ! నా సోదరి.... ....

గ్రహ : హర్ష వర్ధనుడు గంభీరుడనుకొంటిని. ఒప్పగింతలా ?

హర్షు : లేదు. క్రొత్తగా చెప్పవలసిన దేమియులేదు, ఆమె యించుక స్వతంత్రహృదయ——

గ్రహ : నేనెరుగనా ?

బాణుడు : ప్రయాణమునకు లగ్నమాసన్న మగుచున్నది. కమలా రాకుమారి ఆభరణాదులను భద్ర పరిచితివా ?

కమల : సర్వమును భద్రపరచితిని.

బాణుడు : కోసలపతీ : భారతవర్షము నేడల్లకల్లోలముగ నున్నది రాజులెల్లరు కుతంత్రులు, కుబుద్ధులునై యున్నారు. మెలకువతో సంచరింపవలయును.

గ్రహ : చిత్తము.

బాణ ; చాణూరా : రధము నలంకరించితెచ్చితివా: (తెరలో "చిత్తము")

బాణుడు : కుమారీ :

రాజ్యశ్రీ : బాబా :

బాణుడు : యిక నీ పడుచుదనపు బింకములను మానివేయవలయును. ఎప్పుడు నీవు గృహలక్ష్మివైతివో, అప్పుడు నీ బాల్యము కనుమరుగైనదని గ్రహింపుము.

రాజ్యశ్రీ : బాల్య చాపల్యమున నేయొనర్చిన దుడుకుతనములను క్షమింపవలయును,

బాణుడు : పాశీవచ్ఛాయా దాయాదంబులైన నీ సోగకన్నులు బాష్ప పూరితములా !

రాజ్యశ్రీ : బావా ! పుట్టినింటిపై ప్రేమ ఆడుదానికి అణచికొనరానిది.

బాణుడు : నీ ప్రాణసఖి కమల నీ వెంటవచ్చుచున్నది !—గ్రహవర్మ సద్గుణపుంజము. నీవు చింతింపవలసిన పనికాన్పింపదే?—అంగ రక్షకుల సిబ్బంది సిద్ధముగా నున్నదా ?

(తెరలో "దేవా ! సర్వమును సిద్ధముగా నున్నవి")

బాణుడు : లగ్న మాసన్నమైనది. నడువుడు.

(రాజ్యశ్రీ గ్రహవర్మ—బాణునకు నమస్కరింతురు)

బాణుడు : భారతచరిత్రయందు మీ నామములు సువర్ణాక్షర లిఖితము లగుగాక : (దీవించి—నిష్క్రమణము.)

హర్షుడు : (రాజ్యశ్రీని కౌగలించుకొని) అమ్మా ! నన్ను మరువకుము. కమలా : నా సోదరిని నీ కొప్పగించుచున్నాను,

కమల : మహారాజా : మీ సోదరిని బావగారికి ఒప్పగించుటపహాసము. ఆడుదానను నా కొప్పగించిన నేమి ప్రయోజనము !

రాజ్యశ్రీ : కమలా ! నీవు మగవాడవని మాయన్న యభిప్రాయము. దీనికేమందువు ?

కమల : మహారాజు....నొప్పుకొందురు.

హర్షుడు : హర్షుడు అబలల పరిహాసముల కాగ్రహించువాడా !

కమల : అట్టయిన తమకీ మతిభ్రమణ మెప్పుడు కల్గినది మహారాజా!

బాణుడు : (హటాత్తుగా ప్రవేశించి) ఆ....నామహారాజా నెదుట నీవా చాలతయా !

కమల : క్షమింపవలయును.

హర్షుడు : కమలా మృదూక్తులిక మాకు కరవైపోవును కాబోలును.

గ్రహ : ఆ హాస్యలహరిని కోసలనుండి స్థానేశ్వరమునకు ప్రవహింప జేయుమనులెమ్ము. ఆనకట్టలు కట్టుకొనలేక అలజడిపడిపోదువెమో యని సందేహించుచున్నాను.

బాణుడు : కవి వ్యవహారమందమానసము. రండు పోవుదము.

(అందరు నిష్క్రమింతురు.) [యవనిక]



# "నారాణి"

## ద్వితీయాంకము — ప్రథమ రంగము

[ కాశీపట్టము — ఆలోచనామందిరము — శశాంకుడు ప్రవేశము ]

శశాంకుడు :

గురు కృపాణ ముఖంబున గూల్పరాని
యరుల బొలియించు శేముషీ గురుతరాసి
గొడ్డలికి మిక్కుటంబుగా గుబురుకట్టు
వనమునకు, అగ్ని తగిలింప వలయుగాదె.

మానవుని మానస ప్రభావము అతీతమైనది. అఘటన ఘటనా సమర్థతగలది. తమోయుక్తమైన కళేబరమునందు నిబిడీకృతమయ్యూ, ఈరోదసీ బిలమునంతయు తేజోమయముగా నొనరించు శక్తి దానికి గలదు. ఎవడు అట్టి మానసను నుత్తేజితము గావించుకొనునో అతడే ప్రతిభాశాలియై ప్రకాశించును. ఎవ్వడు దానిని ప్రకాశింప జేయడో వాడు నిరర్థకజీవనుడై పశుప్రాయుడై, బలహీనుడై, వ్యర్థముగ నశించును. కావున అట్టి మహాతేజమునే నే నుపాసించెదను. జయము చేకూరదా !

ఉగ్ర : (ప్రవేశించి) జయము, జయము, చక్రవర్తులకు !

శశాం : (తనలో) జయమే చేకూరునట. (ప్రకా) ఉగ్రసేనా ! యిటు కూర్చుండుము. తోరమాణునకు తగిన పరిచర్యల నేర్పాటు చేసితివా ? అతని నేమైన కదలించి చూచితివా ?

ఉగ్ర : మహారాజా ! తోరమాణుడు విశ్వసనీయుడగు వీరుడుకాని, రాజకీయవేత్తగాడు. ముక్కునకు సూటిగాబోవు స్వభావము గలవాడు.

శశాం : గ్రహించితివి. మనము సంకల్పించిన యీ మహోద్యోగమున కాతడు....ఇచ్చగింపడని నీ తాత్పర్యము. నా యీ సంకల్పము

నైచ్యమనీ, దురుద్యోగమనీ అతడనుమానించ వనియా, నీ భయము !....అవును, నీవును అట్లే తలంచుచున్నావు, కాదా, సేనాపతీ ! (అని నిగ్గదీయును)

ఉగ్ర : (భయముతో) లేదు, మహారాజా !

శశాం : లేదనకుము. నీవునూ అట్లే తలంచుచున్నావు—ఇది దుష్కృత్యమైనను, ఘోర నరకమైనను, దానిని సాంగముగ మేము సాధింప నెంచితిమి. సేనాపతుల యసమ్మతికిని, కొండజాతుల కోపాటోపములకును వెరచువాడను కాను....కావున్నా. మాతోడి సంధికియ్య కొననివాడు ఈ తోరమాణుని మాత్రము మాటలతో పోనిత్తుమా ! వంటయిలు సొచ్చిన కుందేలు బ్రతికి బయటబడి నప్పటి మాట.........

ఉగ్ర : ఏమి యభిప్రాయము !

శశాం : (వెకిలినవ్వు) మా యభిప్రాయమా !....అగాధవనీకేల, మందిరముచుట్టూనూ సైన్యమును రహస్యముగ దాచియుంచుము. తోరమాణుని వసతి గృహమునుండి తోడితెచ్చుటకు పరివారము నంపితిమిగదా ! అతడు వచ్చుచుండవచ్చును. నీవికపోయి సైనికుల నాయత్తముచేయుము.

ఉగ్ర : (నిష్క్రమించును)

శశాం :

మనుకొని, తోరమాణునకు, మోదముగూర్చెడు తీపిపల్కులే
యనిచి, ఘంటింతు కార్యము, అహంకృతిమై, తెగనీల్గి, కూ
రుముల్ వినకటు ధీరభాషణల వెక్కిరిజొచ్చెనయేని,
ఉగ్రతన్ జెనకి తదీయశీర్షమును..జెండెద, చండ కృపాణపాణినై.

[ సేవకుడు : (తెరలో) జయము ! జయము ! ]

శశాం : పుళిందనాయకుని యాగమనము నివేదించుచున్నావా ! వచ్చుచున్నాను. (నిష్క్రమి)

[ తిరిగి ప్రవేశము — శశాంకుడు, తోరమాణుడు ]

శశాం : దయచేయుడు....భావిభారతసామ్రాజ్యాధిపతికి స్వాగతము !

తోరమా : (కూర్చుని) వంగసామ్రాట్ ! నన్ను పరిహసించుచున్నారా?

శశాం : అదియేమి !

తోరమా : భారత సామ్రాజ్యమేమి ? నాకు కైవసమగుటేమి ?

శశాం : నిక్కముగా భారతసామ్రాజ్యలక్ష్మి మీ పాదముల నాశ్రయింప మన్నది.... అచిరకాలములో !

తోరమా : ఇదియేటిమాట ! హర్షవర్ధనుడు మృతినొందెనా ?

శశాం : పుళిందనాయకా ! హర్షవర్ధనుడు జీవించియున్న మాత్రమున ఈ కార్యము అసాధ్యమగునా ! భారత సామ్రాజ్యమునకు పట్టాభిషేకము సేయుటకే తమ్మిచ్చటి కాహ్వానించితిమి. తమరు మాతోడి పొత్తున కిచ్చగింతురేని ఆపదము మీకు కరతలామలక మొనర్తుము.

శశాం :

ఇంచుక మాసహాయమున కిచ్చవహింతురయేని. హర్షు ఛే
దించెద. శత్రురాజుల వధించెద. మూకల ఘోరవాహినిన్
ముంచెదసర్వరాజ్యము: 'నమో'యన భారత మెల్లమాత్రలో
మించి జయించి యిచ్చెదనుమీ సముపంచిత కాంచనాళితో.

తోరమా : సిరిరా మోకాలొడ్డువారు కలరా ? తమతోటి సఖ్యము మాకు పరమహ్లాదకరమే. కాని హర్షవర్ధనునితో కయ్యమునకు మాత్రము నే నిచ్చగింపను. అతనికి వెఱచికాదు. నిష్ఫలమని నాయూహ ! యిప్పటికి నాలుమారులా ప్రయత్న మొనర్చితిని కాని ఆ ప్రయత్నములన్నియు విఫలములైనవి. సైన్యములు వ్యర్థముగా నశించి పోయినవి మరల నా ప్రయత్న మొనర్చుట మౌఢ్యము ! కేవలము మౌఢ్యము !

శశాం : ఈతూరి మీకు పోర నగత్యములేదు. హిమాలయ ప్రాంగణమున మీరు విడిసియుండుడు చాలును. తక్కిన కార్యభారము నంతయు నేను వహించెదను.

తోరమా : హిమాలయముల దాటి, యీవలి కడుగిడునప్పుడు సైన్యమో హర్షుడప్పుడే సేనాయుతుడై మాతోడి సంగ్రామమునకు వచ్చును, ఆయోధన మెట్లునూ తప్పదు,

**శశాం:** ఆఁ! నేను కోరుకొనినది యదియే. హర్షుడు స్థానేశ్వరమునుండి అడుగావలకు వైచిన చాలును. క్షణములో వాని రాజ్యమును హరించివైచెదను. కోసలరాజు హర్షునకు బాసటగానైన వచ్చును. లేదా! ఆతని సైన్యమునైన నొసంగును. తక్షణమే యీ రెండు రాజ్యములు హరించి వైచెదను. ఒక్కదెబ్బకు రెండుపక్షులు యిది మన దిగ్విజయమునకు ప్రథమసోపానము.

**తోరమా:** యిది పరాక్రమమగునా?

**శశాం:** కాదు. యిది శేముషీవిభవము.

**తోరమా:** కాదు కాదు, కుతంత్రము.

శశాం: పుళిందనాయకా! తమ్మింతదూరము శ్రమపెట్టినది వస్త్ర వివాదమునకుగాదు. మీకు సామ్రాజ్యము కావలసినచో, ధర్మ ప్రవర్తనలా?

తోరమా: తమకాగ్రహము కల్గినది?

శశాం: లేదు, లేదు: తమరు పొరబడుచున్నారు. ధన సంపాదనమునకు తును ధర్మమార్గాను సరణమునకును పరస్పరవైరుధ్యము. మరి మీరు దేనిని వాంఛించెదరు?

పిలుపుజీవృతీ లసిత, నిర్మలహాసశ్రీ పురోపసీమలన్
తోలికలందు నూగెదరొ! దోసము గీసమటంచు వెట్టిపై
మేలని ముక్కుమూసుకొని పెటితపంబొనరించు కొందురో:
తేలిచి చెప్పివేయుడిక దేనికి దాప పుళింద నాయకా!

**తోరమా:** అట్లయిన మేము మిమ్ము ఆప్తమిత్రులుగ నమ్మ కొనవచ్చునా?

శశాం: ఆ సందేహము తమ కక్కరలేదు. భగవత్సాక్షిగా మీ మైత్రిని స్వీకరింపు చున్నాము. మా పంచిన విధాన మెలంగుట మి **కర్తవ్యము. మిమ్ము భారత సామ్రాజ్యాధిపతిగా నొనర్చుట మా కర్తవ్యము.**

**(తెరలో, కాహళి వినిపించును.)**

కాహళార్భటులు మధ్యాహ్నమును నిరూపించుచున్నవి. భోజనము నకు లేచెదమా?

(ఇరువురూ లేచి నిష్క్రమించుచుందురు.)

శశాం: (తోరమాణుని హస్తమును పట్టుకొని) భారత సామ్రాజ్య కిరీటము తమ శిరమున్పై నుంపజాలదేవి యీ శశాంకుడు జీవింపడు.

(నిష్క్రమింతురు.)

[యవనిక]



## "నా రా ణి"

### ద్వితీయాంకము — ద్వితీయ రంగము

(స్థానేశ్వరము — హర్షవర్ధనుని ఆలోచనా మందిరము.)

(ప్రవేశము — బాణుడు.)

బాణుడు: ఆదినుండియూ భారతవర్షమవిన విదేశీయులకు కన్నెఱ్ఱయే. ఈ కొండజాతుల కల్లోలము మిక్కుటమగుచున్నది. హిందూస్థాన మంతయు ముక్కలు ముక్కలై అసమర్థులగు స్వదేశ ప్రభువు లకు చేజిక్కినది. వీరియందు శౌర్య సంపదలు లేవు సరికదా, ఐకమత్యమైననులేదు. వీరిలో వీరు కీచులాడుకొనుచుండ ఉద్దండు లగు కొండజాతులు భారతవర్షము నాహుతి గొననున్నారు. ఈ క్లిష్టపరిస్థితిని హర్షవర్ధనుడు మాత్ర మెట్లాదుకొనగలడు? ఈతని రాజ్యము చిన్నది; సైన్యమల్పము, కేవల శౌర్యాధికత ఎంత వరకు జయింపగలదు? గగనోత్తుంగ తరంగ మాలికాభీలయగు ప్రళయాంభోరాశికై పడి విజృంభించి భారతవర్షము నంతయు ఉదగ్ర మూర్తియై ముంచివైచుటకు కనుమలనుండి వాహినిగట్టి ప్రవహించుచున్న ఈ శైలచర వాహినీ సందోహముల బాహువు లతో నెంతకాలము వెనుద్రోయగలడు. హర్షుడు హర్షునకు సాయమొనరించిన ఆతనికి సామ్రాజ్య పదవి చేకూరునేమోయని రాజు లెల్లరు విముఖులైయున్నారు. విముఖతయేకాదు....సమ యము దొరికిన....స్థానేశ్వరము నప్పళించి వైచుటకు కనిపెట్టు కొని యున్నారు....ఎందరెందరేచ్చుచున్నను హర్షవర్ధనున కెట్లును సామ్రాజ్యపదవి కైవసము కాకపోదు. తేజోపుంజము ప్రకాశింపక పోవునా? కాదంబినీ నికాయము చండభాను నెంతకాలము కప్పి యుండగలదు.

(తెరలో) మహారాజాధిరాజ హర్షవర్ధన మహారాజావకుతై

బాణు : (స్వగ) నా మహారాజా వచ్చుచున్నాడు.

(తెరలో హర్షుడు. మహామంత్రిగారిని శకటము తోడుకొని రావలయును. నీ గమనవేగమును పరీక్షించెదము. త్వరగా పోయిరమ్ము)

బాణు : మహారాజా ! తమ రాకకై మేమిచ్చటనే నిరీక్షింపుచున్నాము. దయసేయుడు.

(క్రోధితుడై ప్రవేశము హర్షవర్ధనుడు—వచ్చి బాణుని హస్తమందిపుచ్చుకొని)

హర్షుడు :

భారతీయ ప్రజా పటలిలోన లయించి
క్షాత్రవతేజముల్ సడలిపోవ,
భారతీయుల జయకాంక్షలతుల్ పెలరేగి
రిపుల మూకల జడరీకరింప,
భారతీయుల కత్తిపదునులో అదికంత
నాశముల్ రక్తధారలు గళింప.
ఉరిమియిల్లిన హైంద వోద్రిక్తనేత్ర సం
భూతాగ్ని వైరుల బూదిసేయ,

దారుణ కృపాణపాణులై తరలి. శత్రు
మారణోద్యోగమున మేనుమరచి. ప్రళయ
భండనోద్దండ తాండవ చండభాను
లౌచు. జ్వలియింపగా వేళ యయ్యెనుసకు.

బాణు : వత్సా! విజయోస్తు!

హర్షు : వెనుకబోయిన తీవియ కాలికి తగిలినది. వింటిరా !

బాణు వింటిని.

హర్షు : ఈ పుళిందుల నీతూరి నిశ్శేషముగ రాచివేయవలయునేగాని అశ్రద్ధవలని లాభములేదు. తమ చారులుకూడ నీ వార్తనే దెచ్చిరా ?

బాణు : ఆ; మా చారులుగూడ నీ వార్తనే నివేదింపు చున్నారు. సాగరము వలె అపారమై పుళిందవాహిని హిమాలయ ప్రాంగణమున విడిపియున్నదట. తోరమాణుడు స్వయముగ సేనను నడుపు చున్నారట. పుళిందనాయకుడు భారతదేశమువంక చూచి తలమ

వంకింప అతని శిరోభూషణమగు తూలిక సహితము మారుత సంచలితయై సగర్వముగ భారతమును ధిక్కరించుచున్నదట.

హర్ష : బేలయగు నాతూలిక కయ్యది నైజ దుర్గుణమే. రానున్న తన పతనమును గ్రహింపజాలక అల్పుడగువాడు అదిరిపడుటసహజమే

ఒక గర్వాంధు శిరంబుపై నిలచి నేడుయ్యాలలూగున్: మఱీ
య కృపాణంబు తదీయశీర్షమును జెండాడంగ. సద్దానితో.
వికలంబై పడి. దుమ్ములోపొరలు: గర్వంబూతు నంత్యంబు. త
ప్పక నైచ్యంబయి, నవ్వులాటలకు తావై పోవుటల్ క్రొత్తయే.

సామ్రాజ్యకాంక్ష తోరమాణుని హృదయము నొక పాషాణముగా జేసివైచినది. మొన్నటి సమరమున లెక్కకు మిక్కుటమగు నాతని సైన్యము చెఱకుతోటవలె హైందవయోధులచే తెగనఱుకబడినది. హతశేషులు హిమాలయములందు ఘనీభవించిపోయిరి. భయంకరములగు ఆ రక్తవాహినీ సందోహములు. ఆ జీవసంక్షోభము విరోధినైన నా హృదయమునకు సైతము ప్రేమ జ్యోతి నాపాదించినది. కాంక్షామయమై కఠోరమై, పాషాణమై పోయిన తోరమాణుని హృదయముపై మాత్రము అహింసా జ్యోతిని తాండవింప జేయజాలక పోయినది ఎంత కాలుష్యమయమైనది! ఎంత తేజోనిరోధకమైనది అతని మనస్సు!.

బాణు : తోరమాణుడు గొప్పసాధకుడు. మనవలెకాదు. ఆ ప్రాణవహనపర్యంతము వైకల్యమునకు వానియందు తావులేనేలేదు. అల్ప ప్రాణి కాడతడు.

హర్ష : దేవా! సేనను సిద్ధము చేయింపుడు. శాత్రవుల నీడలు భారత భూమిపై పడకపూర్వమే ఖడ్గచాలనమున కనుజ్ఞ దయసేయుడు.

బాణు : యేమిటి యీ ఆవేశము? బలాబల సంఘర్షణా దినములు కావివి. ధిషణా సంఘర్షణముగ మారిపోయినవి.

హర్ష : బాబా! బాణులు నా మహామంత్రులు. ధిషణా సంఘర్షణము వచ్చినను విజయము నాకే?

బాణు : జాతీయ సమస్య బయల్వెడలినప్పుడు బాణుడు నీ మంత్రిత్వమును స్వీకరింపజాలడు. కారణము........ఆ క్లిష్ట పరిస్థితియందు

నీకో మాతృభూమికో విద్రోహము చేయవలసి వచ్చెను. అది యొక భయంకర సమస్య.

హర్ష : బాబా ? (చేయిపట్టుకొనును)

బాణు : అవునోయీ ! నా మహారాజా నీ చేతులతోడనే పెంచుకొంటిని. నా హృదయ గుహాకుహరమున నొక బంధన ముత్పన్నమై నీకా లికి నన్ను కట్టివైచినది ! నిజమే....కాని....ఇప్పుడో, ఇప్పుడో, పుత్రస్నేహమునకు మాతృసేవకు పరస్పర సంఘర్షణము కల్గి నది. శిశువాత్సల్యముకొఱకు మాతృద్రోహము చేయజాలడు, బాణుడు.

హర్ష : హర్షునకు మంత్రిత్వముచేసిన మాత్రమున తమరు మాతృద్రో హము చేయవలసి వచ్చునా ?

బాణు : అట్లయిన విన్నగాక మొన్న నీచేపుళిందలు సర్వనాశనము చేయబడిరిగదా ! మరలనింత యల్పకాలములో నిట్టి దండయాత్ర కెట్లు తెగించిరో చెప్పగలవా ?

హర్ష : (విచారించి)వారిదీ....అనాలోచన....

బాణు : కాదుకాదు, ఈర్ష్యాళువగు భారతీయ ప్రభుదెవ్వడో వానికి సాయ మొసర్తునని యాహ్వాన మంపియున్నాడని నా యనుమానము.

హర్ష : దీనివలన ఆ నీచుదేమి బావుకొన దలచియుండును ?

బాణు : ఏమి బావుకొన దలచియుండునా....సేనాయుతుడవై పుళిందుల తోడి పోరాటమునకు నీవరుగగనే....వాడు నీరాజ్యమును....

హర్ష : హరింపనిండు అల్పమగు స్వార్థమునకు భారత భూమిని పుళిందుల బానిసత్వములోనికి త్రోయజాలను, భాతర జాతీయ మహాయుద్ధమున నేను నిమగ్నుడనై యున్నపుడు: నా రాజ్య మును భారతీయుడొకడు హరింపనిండు. ఆ కీరితి నాకు చాలును.

భారత జాతీయ మహా
దారుణ రణభారవహన దక్షుడవగు నా
యీ రాజ్యము నీచుండై
భారతపాంసను డొకండు పట్టుకపోనీ.

ఆ కీరితి నాకు చాలును.

బాణ : (సహర్షముగా) వంశవర్ధనా ! ఆంతటిఆత్మ సమార్పణ మొన ర్చుటకు నీకు మనో బలమున్నదా ?

హర్ష :

ఎవని యుచ్ఛిష్ట మీ జగ మెల్ల, అట్టి
పూజ్యు శుశ్రూషమై పెనుపొంది, రాజ
రాజ కవిరాజులకును తల్లడముగూర్చు
హర్షుడాత్మ సమర్పణాహర్షిగాడె ?

బాణ : అయినను, వత్సా! తక్కిన రాజులవలె నీవును ఉపేక్షింప రాదా ? నీవుమాత్ర మీ ఆయోధనమునకేల గడంగవలయును ?

హర్ష : ఏటికీ అగ్నిపరీక్షలు ?

బాణ : పరీక్ష కాదు.........యోజించుకొనుము.

హర్ష : తండ్రి హృదయము గుర్తెఱుగని బిడ్డయుండదు. తమ మాన సము నాకు తెలియదా ?

మగ పంతంబున తోరమాణుడనికిన్ మార్కొంటయున్ భీరువై
పగ సాధింపక, వానినోంపక, మహాపఖ్యాతిగా, మాతృ భూ
మి; గరంబుక్కుకశించి అప్పనము సామీ! ఎమ్మెయిన్జేయ బా
ల ? గతింతున్ వధియింతు, మానధనుడీ రాజ్యంబు లెక్కించునే.

దేవా ! గురుదేవుల పాదములయాన, ఈ హర్షవర్ధనుడు నిర్మల హృదయుడై ఆత్మార్పణ మొనర్చుటకు సంసిద్ధుడుగా నున్నాడు. ఆవేశరహితమగు హృదయముతో నీ ప్రతిజ్ఞనూనుచున్నాడు. గురుదేవుల సాక్షిగా వైకల్యమునకు తావొసంగడు. దీవించి పం పుడు. విజయలక్ష్మితో తిరిగి దర్శనము చేయగలడు. (మోక రించును.)

బాణ : ఆయుష్మంతుడా ! లెమ్ము విజయోస్తు! వత్సా ! పోయిరమ్ము. విజయలక్ష్మి సమాయుక్తుడవై తిరిగివచ్చి మాకానందమును గూర్పుము.

హర్ష : జయ్ ! భారతమాతకు జై ! (లేచివిఱచుండును.)

బాణ : కోసలనుండి మాత్రము సైన్యముల దెప్పింపకుము, దానివలన ప్రమాదము కలదు. 'కౌపీన సంరక్షణార్థం అయం పటాటోపః' అని యీ బాపడిట్లే నీస్థానేశ్వరమున కొంత మేకపోతు గాంభీర్య మును వహించి యుండగలడు........కోసలనుండి మాత్రము పొరబడి సైన్యముల దెప్పింపకుము.

హర్ష : చిత్త....నేడే పోయివచ్చెదను.

బాణ : సేనయంతయు సిద్ధముగానే యున్నది........ఆవేశము వలదు. ....వైకల్యము వినాశకారిణి........(తెరవంకచూచి) మహారాజా సంగ్రామమునకు బోవుచున్నారు. విజయగీతముల బాడుడు.

(అనుబంధము ౩.)

(యవనిక)



# "నా రా ణి"

## ద్వితీయాంకము — తృతీయరంగము

[అయోధ్య. అంతఃపురము. రాత్రిసమయము. రాజ్యశ్రీ పూలదండ గ్రుచ్చుచు]

( అనుబంధము 4 )

గ్రహవర్మ : (ప్రవేశము) అనుబంధము 4

[ పూలహారము గ్రహవర్మ కంఠమున రాజ్యశ్రీ యలంకరించి నమస్కరించును. గ్రహవర్మ రాజ్యశ్రీని లేవదీసి కౌగలించుకొనును. ఇరువురు ఆసీనులగుదురు ]

గ్రహ : బాణకవిచంద్రులు యీ దినమొక లేఖనంపియున్నారు.

రాజ్యశ్రీ : మా యన్నగారి విజయమునుగూర్చి ఏమైన వ్రాసిరాఏమి ?

గ్రహ : లేదు....సైన్యములను సిద్ధముగా నుంచుకొనుము, జాగరూకతతో కోటను సంరక్షింపు చుండుము, సైన్యము లన్నిటిని కోట చేరువనే కాపుంచుము అని వ్రాసిరి. నేను మొన్నటిదినమే సైన్యముల నన్నిటినీ హర్షునకు సాయమొనరించుటకు హిమాలయములకు బంపియుంటిని.

రాజ్యశ్రీ : హర్షవర్ధనుడు సైన్యముల నంపుమని తమకు వార్త నంపియుండెనా ?

గ్రహ : లేదు; వ్యర్థముగ నిచ్చటనున్నవి గదాయని నేనే పంపితిని....

రాజ్యశ్రీ : మనము....అనాలోచితమగు పనిచేసితిమేమో !

గ్రహ : ఆఁ మహామంత్రులు జాగ్రతను హెచ్చరించిరేగాని, యిందు పెద్ద ప్రమాదముండదను కొందును.

రాజ్యశ్రీ : చాలా....

గ్రహ : ఊఁ....కోపిమ్మ !....(రాజ్యశ్రీ గడ్డమును కుడిచేతితో పట్టుకొని పైకెత్తి, ఆమె ముఖమువంక తేరిపారజూచును) ఈతన్నుం

నుండి బహిర్గతమగుచున్న ప్రేమజ్యోతి, శుష్కమై తమోమయ మైన, నాహృదయమును తేజోమయము గావించుచున్నది. వేయి కన్నులైనను చాలవు....యీ తేజోరాశిని....ఆనందించుటకు.

రాజ్యశ్రీ : పురుషుని తేజము ప్రకృతిపై ప్రసరించి, జడస్వభావముగల ప్రకృతి చైతన్యతను బొందును. పురుషుడా చైతన్యము ప్రకృతియందే కలదని భ్రమించును. తన తేజమేయని గ్రహింప జాలడు. ఈ భ్రమయే యాతని ప్రకృతి లంపటునిగా జేసివైచును. సూర్యప్రకాశము యీ జగత్తును తేజోమయముగా నొనరించును. ఆతడస్తమింపగనే యీ జగము తమస్సు. తేజము జగత్తునదా? సూర్యునదా ?

గ్రహ : ఏమిటి ? యీ వేదాంతావబోధము !!

రాజ్యశ్రీ : తమరు కవనమునకు గడంగిరి. కవనమునకు వేదాంతమునకు సామీప్యము. అందుచేత నా పల్కులు తమకు వెట్టివేదాంతములుగా దోచినవి కాని, పలికినది ప్రణయతత్వమే ప్రేమజ్యోతి తమ హృదయములో ఉత్పన్నమైనది, అది నాపై ప్రసరింపనే నుత్తేజితనైతిని. తమ హృదయమున ఆప్రణయజ్యోతియే యుత్పన్నము కాకపోయిన నేను శుష్కజీవనగుదును. నాయందే శోభయు తమకు గోచరించియుండదు.

కళల వీనుచు, నాజీవ గగనవీధి
విలచి, పర్వపువెన్నెలల్ వించి, నన్ను
ముగ్ధగా జేసివైచె నీమూర్తి; అందు,
చంచలతమాన్పి. చూడ్కి లయించుకొంటి !!

(అరమోడ్పుకన్నులతో) నా జీవనజ్యోతీ ! నీశీతల దృక్కిరణ ప్రసారమున ఆచంద్రతారక మిట్లే నాపై ప్రణయామృతమును వర్షింపుము; పునీతనై, నీయందు లయించిపోవుదును.

(వామహస్తమును ముద్దిడుకొని కన్నులకుహత్తికొనును.)

గ్రహ - రాజా ! (అని కొవగోట శిరోజముల విముచుచు) నీహృదయ మింతటి నైర్మల్యత నెట్లలవరించు కొనినదే. శ్రీణనమువత

విద్యాగంధ మగత్యము లేదనువారి వాదన కర్థములేదనుటకు నీవే ప్రబల నిదర్శనము.

రాజ్యశ్రీ : (వెంకగా) స్త్రీ విద్య నేరవగూడదు. పురుషుడిక భోజనము కూడాచేయకూడదు. ఆ౯ యీపలుకుల నెవ్వతెవిశ్వసించునులెండు.

గ్రహ : (రాజ్యశ్రీ కుచద్వయమును సరాగముగా నవలోకించి నవ్వుచు)

రాజకరపీడనా భయభ్రాంతినొంది
చక్రమిధునంబు రాణి యాశ్రయముజొచ్చె
హృదయమున హత్తికొని వాని పదిలపఱచి
భయముదీర్చినదామె దువ్వలువ గప్పి,

రాజ్యశ్రీ : (పయ్యెద సవరించుకొని సిగ్గుపడి, అలసగమనమున దూరముననున్న బల్లవద్దకువచ్చి, వెనుదిరిగి తలవంచుకొని నిలచి యుండును).

గహ : (ఆమెవెనుకనే లేచివచ్చి) పోనిమ్ము. రాజు నీచక్రమిధునమును అలజడిపెట్టడు........

రాజ్యశ్రీ : (చిరాకుగా) అబ్బబ్బబ్బా !! అందుచేతనే కవిని పెండ్లిచేసి కొన గూడదందురు.

గ్రహ : (రాజ్యశ్రీని కరముపట్టుకొని మరల ఆసనముపై కూర్చుండ బెట్టుకొని) పోనిమ్ము ! కవులకు విరోధియైన వైయ్యాకరణి నొకని పెండ్లిచేసికొనక పోయితివా ?

రాజ్యశ్రీ : 'ముల్లుదిగిచి కొఱ్ఱుడచికొనినట్లు, కవిని విడచి వైయ్యాకరణి నెక్కడ పెండ్లాడు మనెదరు....మరొకమాట....వైయ్యాకరణి యెవ్వడును వివాహము చేసికొనగూడదని తమరొక శాసనమును, తమ ప్రభుత్వమున ప్రవేశపెట్ట వలయునని మహిళా మండలి పక్షమున తమకు నివేదించు కొనుచున్నాను.

గ్రహ : ఏమి , వానిగతి యేమికాలినది.

రాజ్యశ్రీ : వైయ్యాకరణి సహజముగా రసహీనుడుగా నుండును. అట్టివానిని వివాహమాడిన ఆడుదాని పాట్లు ఇక వేరుగా చెప్ప వలయునా !

గ్రహ : వారిమాట నటుంచుము. నాటకరచయితల నేమిచేయవలయును

రాజ్యశ్రీ : చరిత్రాంశముల తారుమారు చేయకుండ కొంచెము చెవుల పట్టీల పట్టించిన చాలును.

గ్రహ : అట్లయిన ఇప్పుడు, నేను త్వరగా హిమాలయ ప్రాంగణమునకు పోవలయును, (అనిలేచును)

రాజ్యశ్రీ : దేనికి ?....యుద్ధమునకా !

గ్రహ : కాదు, అచ్చట నొక నాటకరచయిత యున్నాడు: వాని నొకసారి గట్టిగా చెవులపట్టీలు పట్టిరావలయును.

రాజ్యశ్రీ : యెవరతడు ?

గ్రహ : ఆ ! యెవడో రత్నావళీ నాటకకర్తయట, హర్షుడట వానిపేరు

రాజ్యశ్రీ ; నన్ను తమకిచ్చుటచేత మా యన్న నట్లనగలిగితిరి.

గ్రహ : (ఆవులించి, ఒడలు విరచుకొని) అర్థరాత్రము కావచ్చినట్లున్నది

రాజ్యశ్రీ : చాల పొద్దుపోయినది. తామించుక విశ్రమింతురు గాక. ఆ పూపాన్పుదరికి దయసేయుడు. (అతని చిటికెనవ్రేలు పుచ్చుకొని ముందునడచు చుండును.)

గ్రహ : (నడుచుచూ దరహాసముతో) మరి....తమరో ?

రాజ్యశ్రీ : (వెనుదిరిగి చిరునవ్వునవ్వుచు) యేమిటి ఆప్రశ్న ? కొంటె మాటలు. (అని ఆతనియెదపై శిరమునానిచి, హస్తములయందు వ్రాలి నిమీలిత నయనముల నాతని ముఖమును దర్శించుచుండును)

(అనుబంధము ౬.)

గ్రహ : (రాజ్యశ్రీని కౌగలించుకొని ముద్దిడుకొనబోవును)

(తెరలో "దబదబ" తలుపుకొట్టిన చప్పుడు....—)

కమల : (తెరలో) దేవీ ! దేవీ ! అమ్మా ! అమ్మా ! మహారాజా ! మహారాజా ! అమ్మా ! తలుపు తలుపు తలుపు.

గ్రహ : ఈ నిశాసమయమున ప్రళయసంక్షుభితమగు ఘనాఘనమువలె గగనప్రఘోర్ణములగు యీ ఆర్త సంఘోషణము లెవరివి (బిగ్గరగా) ఎవరువారు ?

(తెరలో, తలుపుచప్పుడు.)

కమల : (తెరలో) అమ్మా! అమ్మా! మహారాజా! మహారాజా! అమ్మా! తలుపు. తలుపు. తలుపు.

రాజ్యశ్రీ : కమలా!

కమల : (తెరలో) ఆ!

రాజ్యశ్రీ : శార్దూల భయద గర్జాప్రభీతయగు హరిణ శాబకమువలె యేమమ్మా! పరువిడి వచ్చితివి! (తలుపు తీయబోవును)

గ్రహ : (ఆమె వెంటనంటుచు) బిడాలదశనాసమాక్రాంత పుచ్ఛచ్ఛటయై. భీతిలు, శుకాంగనవలె ఈ ఆక్రందనములేమి కమలా?

రాజ్యశ్రీ : (తలుపుతీయును, ఆకంపితగాత్రయై కమల ప్రవేశించును)

కమల :( గద్గదస్వరములో) మహారాజా!

రాజ్యశ్రీ : కమలా! (అని ఆమె యెడమచేయిదండను పట్టుకొనును)

గ్రహవర్మ : కమలా?

కమల : (కంగారుగా) కోటలో ప్రవేశించినవి

గ్రహవర్మ : వన్యమృగములా?

కమల : శత్రుసేనలు.........

గ్రహవర్మ : శత్రువులు!.... నాకు శత్రువులెవరు?

రాజ్యశ్రీ : ఎవరువారు కమలా?

కమల : ఎవరున్నారమ్మా!.........వంగచక్రవర్తి?

గ్రహవర్మ : వంగచక్రవర్తి!,....శశాంకుడు!.....నాకు విరోధియా?

రాజ్యశ్రీ : తమకుకాదు! నాకు. వాడుమంచి అదను చూచుకొని ఎత్తి వచ్చినాడు.

గ్రహ : (స్వగతం) మహామంత్రిగారి లేఖ కిదియా యర్థము!.... (ప్రకాశముగ) రాజ్ఞా!....అతడు నీ కెట్లు విరోధి?

రాజ్యశ్రీ : వీడొకతూరి నాచే పరాభూతుడైనాడు. నేడు వానికీయదను దొరకినది.

గ్రహ : ఏటికీ కాలయాపనము (ఆయుధముల కొరకు గబగబ గదిలోనికి బోవును)

రాజ్యశ్రీ : కమలా ! మనమెచ్చటనైన తలదాచుకొనక పోయిన, శశాంకుడు తన ప్రతిన చెల్లించుకొనును. రాహువు ఇప్పుడు వానికి బాగున్నది.

కమల : చాపక్రింది నీటివలె, వంగీయులు మెల్లగా అరణ్యమున దాగి వచ్చి కోటలో ప్రవేశించిరి. యిప్పుడు పలాయనమే కర్తవ్యము. యుద్ధము చేయుటవలన ప్రాణహానియు, మానహానియు గాని ప్రయోజనము లేదు.

సైనికులు : (తెరలో) మహారాజా ! శత్రువులు, ప్రభూ ! మహారాజా, శత్రువులు.

గ్రహ : (ప్రవేశము—కవచమును ధరించుచు రెండవవైపు తెరలోనికి పోవును)

గ్రహ : (తెరలో) సైనికులారా ! చేతినిండ పనిదొరికినది. సింహ కిశోరముల కైవడి విజృంభించి, ఊచకోత కోయుడు, ఒక్క వంగీయునేని దాటిపోనీయకుడు. అరణ్యములకు పోకుండ మృగయావినోదము మనకు కోటలోనే లభించినది. ఇదిగో ఖడ్గము తెచ్చుకొనుచున్నాను.

సైనికులు : (తెరలో) గ్రహవర్మ మహారాజునకు జై ! భారత మాతకు జై ! (అని కేకలువేయుదురు)

[ ప్రవేశము తిరిగి గ్రహవర్మ: మరల ఆయుధముల గదిలోనికి పోవుచుండును ]

కమల : (రాజ్యశ్రీతో) మహారాజు విజృంభించుచున్నారు ! అది ప్రమాదము.

రాజ్యశ్రీ : ప్రభూ !

గ్రహ : (వెనుదిరిగి తెరలోనికి చూచి) అయోధ్యపై కత్తిగట్టిన వాడెవడు బ్రతికిపోయినాడు; రావణునంతటి వానికే దిక్కులేదు....

రాజ్యశ్రీ తమరు ఆవేశపరులగుచున్నారు.

గ్రహ : ఆవేశమా !........వినాశమా ? (గదిలోనికి నిష్క్రమించును)

రాజ్యశ్రీ : అమ్మో ! అమ్మో ! మహారాజా ! ప్రభూ ! (వెంటబోవును)

కమల : ఉష్ణరక్తము పకోపించినది !

రాజ్యశ్రీ : (తెరలో) నాయీ ఒక్కమాట మన్నింపరు?

గ్రహవర్మ : (ప్రవేశించుచు) (ఆవేశముతో) నీవు రాజ్యశ్రీవేనా ? .... యీ పిరికిమందు నాకు పోయకు (కిరీటము. కత్తితోసహా ప్రవేశము)

రాజ్యశ్రీ : (బ్రతిమాలుచు వెంటనంటియుండును)

గ్రహవర్మ :

అరికృత దుష్పరాభవ మహార్ణవ మగ్నత ప్రగ్గుకంటె. త
త్క్రూరఖరఖడ్గఘాతముల కాహుతులౌటయె మేలసూవె. దు
ర్భరతరకీర్తి మారక భవాకులవృత్తి చరించి. ప్రాణ సం
భరణము చేసుకోమనెదవా ! నగరా ! మన వెన్నుచాటుగా॥

రాజ్యశ్రీ : నన్ను చంపుకొనినట్లు.

గ్రహవర్మ : (బిగ్గరగా) నీకేమైన మతిపోయినదా !

రాజ్యశ్రీ : పరాక్రమమునకు ఇది అదనుగాదు.

గ్రహవర్మ : (వినిపించుకొనక కత్తివంక చూచుచు) పనిలేక దీనికి బొత్తుగా త్రుప్పుపట్టినది. శశాంకుని పుణ్యమాయని దీని త్రుప్పు నేడు కొంత వదలగలదు,

కమల : ప్రభూ !

గ్రహవర్మ : ఆ ! ............ నీకును పిచ్చి యెత్తినదా ?

చచ్చెనా, శశాంకుండేని చావవలయు
లేకయుండిన నేన యూరేగవలయు,
అంతియేగాని యింకరోధోంతరమున
యిద్వరకు తావులేదని యెరుగుమబల ॥

రాజ్యశ్రీ : నాసామీ ! ప్రమాదము ! .... కొంప మునిగిపోవును.

గ్రహవర్మ : ఛీ ! ఏమిటి, యీ యశ్లీలములు ?

రాజ్యశ్రీ : ఒక్కడవు నీవుపోయి శశాంకుని యేబదిలక్షల సైన్యముతో పోరిన యేమైన ప్రయోజనమున్నదా ? (చేయిపట్టుకొనును)

గ్రహవర్మ : (చేయివిదలించి) ఒక్కడు చాలును, యీ బ్రహ్మాండ కటాహమును బ్రద్దలుచేయుటకు.

ద్విరదంబుల్, తమ లావెరుంగని మదాంధీభూతముల్ గాన, ను
ద్ధుర విద్వేషియటంచు, నుగ్రగతి, తత్తుండాగ్రముల్ సాచి, యా
ద్విరదద్వేషిని పట్టనెంచునొకొ ? తద్వీరాహవక్షోణి, నె
క్కరణిన్ విల్వగ నేర్చు, భంజితఘటాకాంద ప్రకాండంబులన్ ॥

రాజ్యశ్రీ: ఒక్కమాట.
గృహవర్మ: వ్యవధి లేదు.
రాజ్యశ్రీ: ఎంత పెంకెతనము. (దుఃఖించును)
కమల: ప్రభూ!
గ్రహవర్మ: పఱకకూడదని ప్రభుశాసనము: జయ్ భారతమాతకు జై
(నిష్క్ర)

[తెరలో జయధ్వనులు]

గ్రహవర్మ: (తెరలో) కొట్టుడు, కొట్టుడు, తలలు పగులకొట్టుడు, పళ్ళులు లేవదీయుడు. శశాంకుడెచ్చట నున్నాడో చూచి ముందు వాని తాళము పట్టుడు.

[గ్రహవర్మ ప్రవేశము: హఠాత్తుగా]

గ్రహ: కమలా! ప్రమాదము సంభవించిన మొన్న నీకు చూపిన రహస్యమార్గమున రాజపుత్రిని అరణ్యమునకు చేకొనిపోయి హర్షుడు వచ్చుదనుక తలదాచుకొనుడు.... ముందాదీపిక నార్పి వేయుడు. (నిష్క్రమించును)
కమల: (దీపికనార్పును)
రాజ్యశ్రీ: క్షణములో అంధకారమైపోయినదే కమలా! ఈ చీకటిలో నేను బ్రతకజాలను. (క్రింద కూలబడును)
కమల: (పైటచెంగుతో విసరుచు) అమ్మా....
రాజ్యశ్రీ: శశాంకా! ఆడుదాని నఖాగ్రమును కదల్పలేకపోయిన నీవు సిగ్గులేక మగవారిపై కత్తిగట్టుచున్నావా!.... అబ్బా!
కమల: అమ్మా! అమ్మా! అమ్మా!
రాజ్యశ్రీ: కమలా! అయోమయముగా నున్నదే!
కమల: అమ్మా! లెమ్మ! ధైర్యమును విడువవలదు. విషమపరీక్షయే వచ్చినది.

రాజ్యశ్రీ : (చివాలునలేచి) మగవారి సంతోషములో భాగము పంచు కొనుచున్నాముకదా! వారికష్టమున మాత్రము మనకు భాగములేదా!

కమల : లేకేమైనది ?

రాజ్యశ్రీ : లేకేమైనదా! నాచేసిన తప్పునకు నా పతి ఆత్మార్పణము చేయబోయినాడు. ప్రాణఖిలిచే నేనిచట నిలచిపోయితిని.

కమల : ఆడుదానవు నీవంతకన్న యేమిచేయగలవు ?

రాజ్యశ్రీ : ఏమిచేయగలనా ? చంపగలను - చావగలను

(గబగబ ఆయుధములగదిలోనికి పోవును)

కమల : గోరుచుట్టుపై రోకటిపోటన్నట్లు, యిది రెండవ ప్రమాదము.

(అని రెండడుగులు రాజ్యశ్రీ పోయినమార్గమువైపు పోవును)

రాజ్యశ్రీ : (ప్రవేశము; కత్తిపుచ్చుకొని) యీ మిథునమీనాటితోసరి ! లేదా, ఉగ్రసేన శశాంకులుసరి ! శశాంకా ! భారత నారీమణుల విజృంభణము నాచుట నీవంటి నీచులకు సాధ్యమా ? యౌవన పరిభ్రాంతవై, మైమరచియున్న కోడెత్రాచును తోక త్రొక్కెదవుగా ? ఆ నాగకామిని పడగలు విప్పుకొని నీపై బుసవచ్చుచున్నది. అంగాంగ సందష్టుడవై, విషానలజ్వాలల భస్మీభూతుడవు కాను న్నావు. కాచికొమ్ము.

కమల : భర్తృదారికా ! నీవు తొందరపడుచున్నావు. (అనిచేయి పట్టు కొనును)

రాజ్యశ్రీ : (చేయివిదలించి) ఆరహస్య ద్వారమున అరణ్యములకు పోయి తలదాచికొమ్ము, పొమ్ము.

[తెరలో :- శశాంక మహారాజునకు జయ్ ! అని ఒక్కుమ్మడి శాత్రువుల విజయధ్వానములు.]

రాజ్యశ్రీ : రాజ్యశ్రీ బ్రతికియున్నంత కాలము మీకు విజయ మెక్కడ? [అని పెనగులాడును, కమల వెనుకకు లాగును]

కమల : అందరకు ఒక్కసారి ఉన్మత్తత కలిగినది.

(తెరలో శశాంక మహారాజునకు జై ! అని విజయధ్వానములు)

సైనికులు : (తెరలో) మహారాజు శత్రువులకు చిక్కినారు. శత్రువులు రాణివాసమువైపు వచ్చుచున్నారు. పొండు, పొండు! పారిపొండు! ప్రాణముల సంరంక్షించుకొనుడు.

రాజ్యశ్రీ : రాణివాసము పారిపోదు. పరిపంథి కరవాలములకు బలియై పోవును, [అని ముందుకు పోబోవ, కమల రాజ్యశ్రీని బలవంతముగా లోనికి తీసికొనుపోవును]

(ప్రవేశము, కవచ కార్ముకధారులై, ఉగ్రసేన శశాంకులు, సైనికులు; ఉగ్రసేనుని కరమునందు రత్నదీపిక, శశాంకుని హస్తమునందు గ్రహవర్మ కిరీటము; సైనికుల హస్తములయందు దీపికలు )

శశాంకు : ఈ మందిరమింత చీకటిగానున్నదేమి ? మరికొన్ని కాగడాల వెలిగింపుడు. ఒక్క ప్రాణినేని దాటిపోనీయకుడు,

(సైనికులు తలొకమూలకు నిష్క్రమింతురు)

ఉగ్రసేనా : రాణివాసమును మేము బంధించి తెచ్చెదము, నీవు పోయి ధనాగారమును వశము చేసుకొనుము. ఆ రత్న దీపికను మాకిమ్ము.

(ఉగ్రసేనుడు శశాంకునకు నమస్కరించి దీపికనిచ్చి నిష్క్రమించును —
(శశాంకుడు యిటు నటు వెదకుచు మూలగా నిష్క్రమించును)

[యవనిక]



# " నా రా ణి "

## ద్వితీయాంకము — చతుర్థరంగము

[ వనప్రదేశము: గుహాప్రాంగణము —తరుచ్ఛాయ యందు పరుండి రాజ్యశ్రీ ]

రాజ్యశ్రీ : (మెల్లనలేచి) మహామేరుశృంగమునుండి. తృటిలో యీ భయంకర పాతాళ గుహాకుహరమునకా ! ఏమి నా పతనము.

వర్ధనాహ్వయశూర వారాసి జన్మించి
గంభీరు బాణునంకమున బెరిగి
గండర గండడై కదన ప్రచండుడౌ
హర్షు సౌభ్రాత్రత నధివసించి
కోసల లక్ష్మితో కొసరి సపత్నిత్వ
గురు గౌరవము పంచుకొని చెలంగి
భారత వీర నారీరత్నముల కెల్ల
నాదర్శ మీ మెయంచాడ నెనసి

యింతలో చింతనైచ్య మే నెట్టులోర్తు,
సంపద తొలంగి, ఆత్మీయ జనులబాసి,
జీవనజ్యోతి అరులకు జిక్కబెట్టి,
యిమ్మహా దుఃఖవారాశి నీదుటెట్లు.

విధి యీ నా హృదయమును అంపపుకోతల కోయుచున్నది. ఆ కోతలలో తెగిన యీ సంక్షోభరజములో, హుతాశను డావిర్భ వించి జ్వాలయై దుర్ద్ధర్ష్య సమాక్రాంతమగు, యీ రాజలోకము నొక్కసారి దహించివేయడా ? ప్రళయకాల పరిభ్రాంతమైనట్టులీ భూచక్రము ఇట్లొక్కసారి గిర్రున తిరిగిపోయినదేమి? (చేతులతో తల నొక్కుకొని) కపాలఫలకము చిటిలిపోవునట్లీ శిరోవేదన

యేమి ?........ధర్మసంస్థాపకుడట.........భగవంతుడట.... ....
అట్టివాడున్నాడా ?....అట్టి....వా....డున్నాడా!

తరగలై, పొంగి, పొరలు హృదంతరోరు
ప్రళయ శోకార్ణవంబు; తజ్జలధిబుట్టి
చండబడబానలం బొందు మెండుకొనియె,
ఇమ్మహార్చుల నే....భరియింపజాల.

....భరియింపజాల....భరియింపజాల....(కనులుమూసుకొని పడి
పోవును)

[ పురుషవేషమున కమల ప్రవేశించి తలపాగాను దీసిచేతబుచ్చుకొని ]

కమల: మూర్తీభవించిన శోకదేవతవలె వాపోవుచున్నది. (రాజ్యశ్రీని లేవదీసి, చెక్కిలి నిమురుచు, శిరమును మూర్కొని) దేవీ గుహాభ్యంతరమునువీడి బయటికేల వచ్చితివమ్మా ? ఈ నీ దైన్యము వలన నిరుత్సాహము, కార్యభంగము.

రాజ్యశ్రీ: (కౌగలించుకొని) కమలా!

ఇమ్మహాదుఃఖవారాశి నీదలేక
తలమునుకలౌచు నే మున్గి తల్లడిల్ల
యేద్వవలదంచు బుజ్జగించెద విదేల ?
మునిగిపోనిమ్ము! పాతాళమునకు నన్ను ॥

కమల: విషాదము, అపక్వహృదయ లక్షణము.

రాజ్యశ్రీ: ఈ నా హృదయశల్యములు. లేయనంటి మొవ్వుల జీల్చివైచు కంటకములవలె వాడియైపోయినవే కమలా!

కమల: (చింతించును)

రాజ్యశ్రీ: (లేచి తప్పటడుగులు వైచుచు) రాచపీనుగు తోడులేనిది చావదని, నీవుకూడ నాతో యీ యలజడి నేల పడవలయును. (మెడలోని హారము దీసి కమలమీద పడవైచి) యెందైన పోయి సుఖముగా తలదాచుకొనుము. పరిభవ పరితాప దావానల కీలికాజ్వాలికా మాలికలలో భస్మీభూతనై, ఈ భారత శ్మశాన

మున విలాసమయముల పిశాచమువలె సంచరించెదను. (గుహ లోనికిబోవును)

కమల : (ముందునకువచ్చి) ఈ గంభీరతరణి, దుర్భర పరిభవ ప్రభంజనా ప్రపీడితయై, గగనంకష కల్లోలయగు, మహాదుఃఖసాగర మధ్యమున తల్లడిలిపోవుచున్నది ........ నిజమే! తలచుకొనిన ఈ విపద్దశ హృదయవిదారకమై, కడుపు చెరువై పోవును........ ఈమెకిప్పుడు వైధవ్యమో. మాంగల్యమోకూడ తెలియకుండ పోయినది ........ఏమని ఈమె ననునయింపగలను. ఆహారాదుల కొఱకు పురంబున కరుగవలసివచ్చినపుడెల్ల నా హృదయము దడదడలాడిపోవుచున్నది .... ఏమో! ఏ ఆత్మహత్య చేసుకొనునో! .... ప్రతీకారకాంక్షతో నింతవరకు జీవముల నిలిపి యుంచినది కాని, లేకయుండిన యానాడే యసువుల వీడియుండెడిది. వనచరములవలె, నీ గుహాభ్యంతరమున నిట్లెంత కాలమవసి యుండవలయునో! .... అన్నన్నా! నేనెంత తెలివితక్కువను పడిపోవుచున్నాను, నేనిచ్చట వ్యర్థముగ కాలయాపనము చేయుచున్నాను. ఆపాదమస్తకము నన్నేదో బలహీనతా పిశాచము ఆవేశించినది. కన్నులుండియు అంధత్వము కలిగినది, నిరుత్సాహభరము నన్ను పాతాళమునకు దించుకొనిపోవుచున్నది. ఏ అసమర్థత భారతజాతినంతను అణచివైచుచున్నదో అదియే నన్నును కాల్పట్టి క్రిందికి దిగబీడ్చుచున్నది. ఆర్యులప్రతాపరక్తము నాలో చప్పున చల్లారిపోయినది ........ ఈ భగ్నతూలికల నొక్కసారి విదళించివైచి, నూతన పక్షచ్ఛటతో, నూతనోత్సాహముతో, గగనోన్ముఖనై, డేగవలె పరుగిడవలెను .... అంగాంగముల నన్నావరించియున్న, ఈ నిద్రాపిశాచమును ఒక్కసారి దులిపి వైచి, కార్యరంగమున దుముకవలెనేగాని, ఈ మందమతివలన యేమైన ప్రయోజనమున్నదా! ఏదోయొక విషమ ప్రయత్నమునకు గడంగవలయును. కూపస్థ మండూకమువలె, ఈ గుహాభ్యంతరమున ఏమున్నది .... నా అస్తికలు!

దేవా! యీ చరాచరము నొక్కసారి విస్ఫురితముగా జేయుజాలు నీ చైతన్యతను నాకు కొంత ప్రసాదింపుము. ఛిన్నా

తన తేజము నొసంగుము.... యీ మహోద్యోతమున, శశాంకు నకు ప్రత్యర్థినిగా నేనే నిలువవలయును. ఈ ద్వంద్వయుద్ధమున మాలో నెవ్వరోయొకరు వినాశము నొందవలయును. ఎంత వరకు పశుబలము విజయము నందగలదో చూడవలయును. మహిళాజనముమాత్రము శత్రుమారణోద్యోగమున నేల విజయము నందజాలరో కనుగొనియెదను.... నా రాణి నిందే భద్రపరచి పోయి వాని తాళము పట్టెదను. విజ్ఞానమయియగు నారాణి కాపాదింపబడిన యీ పరాభవమునకు తగిన ప్రతీకారము చేయగలనా సరి, లేదా ? ఆత్మసమార్పణముజేసెదను, వెనుదీయను. ఆడుదాని ప్రతిభ అతీతమైనదని యీ జగత్తునకు తెలియబడునుగాక!

హైందవ మహిళాజనామ్లాన గౌరవం
బరచేతి కుసుమమై యలరుగాక!
అఘటనఘటనా సమర్థ లంగనలవి
ధిశ దిశలకు వార్త దెలియుగాక!
పశుబల దౌష్ట్యంబు భంగమై క్షణములో
చెడిపోవునని చాటబడునుగాక!
ప్రత్యర్థి సైన్యసంపత్తి ఛిన్నా భిన్న
మై, క్షణంబున నాశమగునుగాక!
వితతమామక వైదుషీ విభవవార్ధి
లీల నుల్లోల కల్లోల జాలయగుచు
పొంగి పొరలి శశాంకు విభూతివెల్ల
మునుకొవి యుదగ్రమూర్తియై ముంచుగాక!

(గుహలోనికి నిష్క్రమించును)

(య వ ని క)

# "నా రా ణి"

## ద్వితీయాంకము — పంచమరంగము

### హిమాలయ ప్రాంగణము — అర్ధరాత్రిసమయము

[తోరమాణుడు ఆలోచనా నిమగ్నుడై ఒకపెద్ద లాతిబండపై కూర్చునియుండును]

తోరమా : స్థానేశ్వరమును ముట్టడించుటకు మారు శశాంకచక్రవర్తి ముందుగా కోసల నాక్రమించుటకు కారణమేమై యుండవచ్చును? ఈ విపర్యయమునకు తగిన కారణము కాన్పింపదే! మమ్ము సహితము యీతడు మోసగించుటలేదు కదా!....కాదు, కాదు, కోసలదుర్గము దిటవైనదగుటచే ముందుగా దాని నాక్రమించిన యీ కార్యమును సులభముగా సాధించవచ్చునని అతడూహించుకొని యుండును.

[ శ్వేతపతాకము చేబూని హర్షవర్ధనుడు వెనుకనుండి ప్రవేశము ]

హర్ష : పుళిందనాయకా!

తోరమా : ఎవరువారు ?

హర్ష : మాది స్థానేశ్వరము

తోరమా : ఎవరువారు ? హర్షవర్ధన మహారాజా!

హర్ష : ఆఁ! నేనే

తోరమా : ఈ నిశాసమయమున పరివార విహీనులై, మా సేనావార ప్రాంగణమున ఒంటరిగ, నిర్భయులై చరించుచుంటిరేల మహారాజా! నయమే. ముందుగా నాకే కాన్పించితిరి.

హర్ష : (దరహాసముతో) సింహకిశోరము మదగజముల గుంపులలో నిర్భయముగ సంచరించును. దానికేమి లెండు. నేనొక యంశమును తమతో ప్రసంగించుటకు వచ్చితిని. వ్యవధి నొసంగగలరా!

తోరమా : మహారాజా ! మహానందముగ

హర్ష : పుళిందనాయకా !

వేనకువేలుగా నిచట వీరులు కూలగనేల? ప్రాణముల్
పోసికతాన దీనులయి పోడిమిమాలి భయంకరవ్యధన్
మానుగ కుందనేమిటికి ! మాన్పుడు సంగర మేను మీరునున్
పూని రణస్థలిన్ నిలచి పోరుద మిందరు చావనేటికిన్.

యీ రణపర్యవసానము మన యిరువురి ప్రాణములలో దేనినో ఒకదానిని పుచ్చుగొనక గాని సంఘటిల్లదు. మన మిరువురమును ద్వంద్వయుద్ధమునకు గడంగి యీవిజయమును తేల్చివైచు కొనెదము గాక! ఈతుములము నాపింపుడు. ఇన్ని ప్రాణులను వృధగా క్షోభపెట్టుట అర్థములేని కార్యము.

తోరమా : మహారాజా ! మీరును పోరనగత్యములేదు? నేనును పోరనగత్యములేదు. మీ సైన్యము నాపింపుడు. నాసైన్యము నాపించెదను....కొంతకాలమువరకు. అసలు నాకిపుడు పోరవలయునని లేదు....

హర్షుడు : నా సైన్యము నాపించెదను. హిమాలయములదాటి ఆవలికి చనుడు.

తోరమా : (దరహాసముతో) హిమాలయముల వీడిపోవుటకు వీలు లేదు....

హర్షుడు : ఈ రణము నాపింతునంటిరే. ?

తోరమా : అల్పకాల మాపింతును.

హర్షుడు : అనగా—

తోరమా : ఇచ్చటనే కొంతకాలము సమయముకొఱకు నిరీక్షింపుచుందును. అందుచేతనేగదా యుద్ధ విరామము కావలయునని తమకు రాయబార మంపియుంటిని.

హర్షుడు : పుళిందనాయకా ! మేము మీ కొఱకు ఎంతకాల మిట్లు కాచుకొని యుండవలయునని మీ తలంపు.

తోరమా : మా కార్యసమాప్తివరకు—

హర్షుడు: కార్యసమాప్తియా! ఏ కార్యము? ఏ కార్యసమాప్తివఱకు మీరు పోరదు? ఏ కార్యముకొఱకు మీరిచట నిరీక్షింపు చుండెదరు?

తోరమా: అబ్బే! పొరబాటున వచ్చినది; ఏ కార్యమునులేదు....యే కార్యమునులేదు....(నీళ్లు నమలుచూ)

హర్షుడు: గ్రహించితిని, పుళిందనాయకా! గ్రహించితిని.

నిర్భాగ్యుండగు భారతీయుడెవడో నీకీ మహారాజ్యమున్
దౌర్భాగ్యుండయి యప్పనంబుసలుపన్ తా రమ్మనెన్ నిన్ను; ఈ
దుర్భేద్యంబగు భారతంబు సొరగా దోశ్శక్తుడెవ్వాడు; నే
గర్వంబుల్ ప్రిదులింతు చండతర ఖడ్గాఘాతవ్రాతంబులన్.

తోరమా: ఆ! యీ మృషాలాపముల కేమిలెండు,

హర్షుడు: మృషాలాపములా! చండతర హైందవ కఠోర కృపాణ ప్రళయతాండవములు, పుళిందవీరమశకముల చిదుకద్రొక్కి వేయునపుడు మృషాలాపములో, వీరవాక్యములో అప్పుడు తెలియగలవు, యిప్పుడెట్లు తెలియగలవు. సెలవు దయసేయుడు. పోయివచ్చెదను,

తోరమా: (నవ్వుచూ) వీరవరా! యిప్పుడు మిమ్ములను బంధించిన ఏమిచేయగలరు?

హర్షుడు: బ్రహ్మాండ కటాహమును బ్రద్దలుచేయగలను. నిశితకృపాణ మాత్ర పరిరక్షితుడనై, మీసేనాఘటాకాండమున సింహకిశోరము కైవడి విజృంభించి చెండాడగలను. రమ్మనుడు, రమ్మనుడు, అట్టి ధీశాలియైన వీరుడు కలడేని రమ్మనుడు. నాబలాబలములను మీకు ప్రత్యక్షము చేసెదను,

తోరమా: మహారాజా! మిమ్మొక త్రుటిలో బంధింపగలను. కాని ఈ తోరమాణుడు, నిస్సహాయుడు, ఏకాకియునగు ఒక వీరుని బంధించునంతటి నీచుడుకాడు. ఈ వృథా వాగ్వాదమేల! పోయిరండు,

హర్షుడు : ఈ రణపరిణామమును త్వరలో తేల్చుకొనవలయును. మేమహోరాత్రములు పోరుటకు నిశ్చయించుకొంటిమి. రాత్రులందుసహితము మీకు విరామము నొసంగజాలము. మీరు సిద్ధపడుడు. ఇప్పుడే రణారంభము. పోయివచ్చెదను (నిష్క్రమించును)

తోరమా : వ్యర్థముగా ఇపుడీ సింగమును కదల్చితిని. యీ అగ్ని యిప్పుడు ప్రజ్వలింపవలసినదికాదు. వారు యిప్పుడే దాడికి వచ్చెదరు. సైన్యముల సిద్ధము చేయవలయును. (నిష్క్ర-)

[ యవనిక ]



(శ్రీ)

# " నా రా జి "

## తృతీయాంకము — ప్రథమ రంగము

[ బాణుని మందిరము — బాణుడు — చేరువలో నిలచి, ఒక చారుడు — తలవంచుకొని బాణుడు, ఆలోచనానిమగ్నుడు....చివాలున తలయెత్తి....]

బాణు : చారుడా! ఈ అసంపూర్తి వార్తను దెచ్చితివేమి?....గ్రహవర్మ మహారాజు నేమిచేసిరో తెలిసికొనజాలక పోయితివా?

చారు : స్వామీ ఆ రహస్యము బయల్పడు నట్లులేదు.... ....శ్రీవారి నెచ్చటికో రహస్యముగా పంపివైచిరని మాత్రము తెలియుచున్నది.

బాణు : సరే....ఇక....నీవు పోవచ్చును....ఆఁ! ఆగు!....హిమాలయ ప్రాంగణమున తోరమాణుని వధించితిననియు, విజయముతో తాను స్థానేశ్వరమునకు మరలి వచ్చుచున్నాననియు, హర్షుడు మాకు వార్తనంపియున్నాడు. అశ్వముపై వాయువేగమున నీవా తని కడకేగి ఇప్పుడు తానిచటికిరా పనిలేదనియూ. అయోధ్యకు పోయి ముందుగా దాని నాక్రమింప వలెననియు చెప్పుము........ త్వరగా తరలిపొమ్ము. (చారుని నిష్క్రమణము) (స్వగతం) ఈ విపర్యయమునకు తగిన కారణము కాన్పింపదే!....కోసల నుండి సైన్యముల దెప్పింపవలదని....నొక్కి చెప్పియుంటినే:.... హూఁ....ఇది హర్షుడుచేసిన పనిగాదు....ఆపెండ్లికొడుకు గ్రహవర్మ....ఈ తెలివితక్కువ!....తగవితొందర! ....కొంపమీదికి దెచ్చినాడు....శశాంక చక్రవర్తి ఈతని నేమి చేసియుండును?.... (ఆలోచన..స్ఫురణ) ఔను! తప్పక ఆ రహస్య వనదుర్గమునందే దాచియుండును. శశాంకుని దౌష్ట్యమునకు...అది..కేంద్రస్థానము.

పరి....నే నీ రాత్రియే పయనమై ఆ దుర్గప్రాంతమునకు బోయెదను....ఇప్పుడొంటరిగా కోసలకు బోయినమాత్ర మేమి ప్రయోజనమున్నది?....ఆ దుర్గప్రాంతమున కేబోయెదను.... (పరికాశముగ) ఎవడురా? (సేవకుని ప్రవేశము) మాకు కొంచ మస్వస్థతగా నున్నది. మూడుదినముల వరకునూ ఏరికినీ దర్శన మొసంగజాలము....తెలసినదా?

సేవ: చిత్తము (నిష్క్రమణ)

బాణు: (స్వగతం) శ్రీశశాంకచక్రవర్తీ! ఏమిరా నీవెట్టి!....నా పెండ్లి కుమారునే బంధించికొని పో నెంచితివిగా....ఈ ముదుసలి సింగ మప్పుడే గుడ్లు తేలవైచి ఎచ్చటనో గుటుక్కుమనెనను కొంటివా యేమిరా!....యేమిరా నీవెట్టి! (నిష్క్రమణ)

[ యవనిక ]

# " నా రా జి "

## తృతీయాంకము — ద్వితీయరంగము

[సత్రములో వొకగది]

ప్రవేశము : సంగీతపాటకుని వేషమున కమల

కమల : ఉగ్రసేనుడు యీ సత్రమున విడిసియున్నాడు. ఆయెదుటి గది యందే యున్నాడు. వీనిని కదలించిచూచిన కొన్నిఅంశములు తెలియగలవు. సమయము దొరకెనా, యీ చదరంగమున, యీ కాయనే, ఏదో పెదయెత్తువేసి. వెనుకకు తప్పుడు నడక నడి పించి, సందుచేసి, "రాజు" అని ఆటకట్టించి వైచెదను....వాడి ప్పుడిచటికి తనంతతావచ్చు ఉపాయమాలోచింప వలయును. నాయంత నేనుపోయి మాటాడుట కుపక్రమించిన, అంతగౌరవము గానూ ఉండదు. దానివలన కార్యభంగముకూడ కావచ్చును. నేని చ్చట స్థిమితముగా, కూర్చుండి, అష్టపదిగానమున కుపక్రమిం తును.........ఈ నాగస్వరముపట్టి, యీ పాము నాకర్షించి బుట్టలో పెట్టవలయును.

[ అనుబంధము-6 ]

(అష్టపది గానము చేయుచుండ)

ఉగ్ర : (తెరలో) అయ్యా, లోనికిరావచ్చునా ?

కమల : ఎవరువారు ?

ఉగ్ర : (తెరలో) పాంథులము

కమల : దయచేయుడు, (ప్రవేశము, ఉగ్రసేనుడు) యిటు దయ చేయుడు,

ఉగ్రసే: (కూర్చుని స్వగతము) ఈ సరస్వతీ మూర్తిగనుకనే యీ గానవైభవము. (ప్రకా) అయ్యా! తమ పుంస్కోకిలా కలాలాపము మమ్మాకర్షించినది.

కమల: తమకు సంగీతమునందు ప్రవేశమున్నట్లున్నది!

ఉగ్రసే: లేదు లేదు, నేనొకరస పిపాసువును మాత్రము.

కమల: (ఎగాదిగజూచి కొంచెెగా) వంగీయులా?

ఉగ్రసే: అవును. మాది వంగదేశమే. ఏమట్లంటిరి?

కమల: వంగమెట్లయిన కొంచెమునదువు.(యిరువురునవ్వుకొందురు)

ఉగ్రసే: తమ రేదేని మరియొకటి గానము చేతురేమో యని కుతూహల పడుచున్నాను.

కమల: పాటలకేమిలెండు, కవియొకడు, గాయకుడొకడు .... 'వద్దురా బాబూ!' యని బ్రతిమాలినను వినకుండ మ్రోతలుమ్రోగి ప్రాణము విసిగింతురు .... మేమిపుడు గీతగోవిందములో పడి మునిగిపోవుచున్నాము. పాటలకేమిలెండు.

ఉగ్రసే: ఏమి? తమకేమేని యాపదవచ్చినదా?

కమల: అబ్బెబ్బె! మాకేమియురాలేదు. గీత గోవిందమనగా ఏద్పు కాదు! జయదేవుని గీత గోవిందమని నాతాత్పర్యము.

ఉగ్రసే: తమరు అష్టపదులు గానముచేయగలరా! తమ కోకిల కంఠమునకును, జయదేవుని మంజుభాషలకును సరిగా సరిపోవును.

కమల: (తనలో) ఈ తంత్రినే మీటిచూడవలయును, గాని మనము ముందుగా తొందరపడరాదు.

ఉగ్రసే: తమరేమైన గానముచేయరా!

కమల: ఒకరాజు విరోధులకు జిక్కినాడు. రాణి, దుఃఖములో మునిగి పోయినది. ఆమె ప్రాణసఖి ప్రతీకారముచేయబూని కార్యరంగమునకురుకుచు పాడిన ఆవేశము ఈ పాట!

— గే య ము —

మహోజ్జ్వలప్రభా భాస • మానోగ్రతేజమున
స్ఫురితమై యీ జగము • పూతమై పోవాలి ॥మహో॥
నారాణిపరిభవము • నేనెతీర్చాలి
నారాణి దుఃఖమును • నేనె మాన్పాలి ॥మహో॥

ఉగ్రసే: గోవిందమున నేదేని పాడుదురు.

కమల: భావకవనము తమకు గిట్టినట్లున్నది .... ఆఁ! గోవిందయనగా జ్ఞప్తికివచ్చినది; అన్నట్లు .... అడుగమరచితిని .... మీరు వంగియులేకాబోలును .... మీ చక్రవర్తి గోవింద కొట్టినాడాఏమి?

ఉగ్రసే: నేను వారి సేనాపతిని. నాముందు వారి నట్లనగూడదు.

కమల: ఏమేమి? తమరాతని సేనానాయకులా! యింకను శశాంక చక్రవర్తి బ్రతికేయున్నాడా? ఆశ్చర్యము! తమరు .... నాతో పరియాచకములాడుచున్నారు. తమరు బహుచలోక్తిగ మాటలాడగలరు. శశాంకుడేమి .... బ్రతికియుండుటేమి?

ఉగ్రసే: మీపలుకులు విచిత్రముగానున్నవి.

కమల: చిత్రమేమున్నది? శశాంకులింకనూ బ్రతికియే యున్నారా?

ఉగ్రసే: మా మహారాజునకేమి; వారిపుడు కోసలలో దిగ్విజయము నొంది లక్షణముగ నున్నారు. అసలు మీకీ సందేహమేల కలిగినది?

కమల: శశాంకచక్రవర్తి.........కోసలలో నుండుట .... చిత్రముగా నున్నదే! అచ్చటనేమిచేయుచున్నారు?

ఉగ్రసే: ఆరాజ్యము నాక్రమించుకొనిరి.

కమల: గ్రహవర్మ మహారాజేమైనారు?

ఉగ్రసే: మా చక్రవర్తి ఆతని తల దీయుటకొఱకు రహస్య ప్రదేశమున కంపియున్నానని చెప్పిరి.

కమల: గ్రహవర్మ మహారాజును యీపాటికి తలదీసి యుందురా?

ఉగ్రసే: ఆ పని ముగిసియుండవచ్చును. ఆవివరములు.........నాకు తెలియవు.

కమల: తమరు దండనాధులుగదా?

ఉగ్రసే: రాచకార్య నిర్వహణమందు మాచక్రవర్తి దండనాధునితో సహితమాలోచింపరు.

కమల: (మొగము చిట్లించుకొని) ఆ రహస్యప్రదేశమెక్కడ?

ఉగ్రసే: అది.... చెప్పజాలను.

కమల: మరి, రాణి యేమైనది?

ఉగ్రసే: ఆమె జాడలింకను తెలియలేదు,

కమల: అడుగమరచితివి? యీమీపయనమెచ్చటికి?

ఉగ్రసే: కాశీఘట్టమునకు; ఈ విజయవార్తను చాటుటకు,

కమల: (వికటముగా నవ్వును)

ఉగ్రసే: ఈ మీప్రవర్తనము చిత్రముగా నున్నది?

కమల: మీప్రవర్తనమును నాకు చిత్రముగానే యున్నది. శశాంకుని విజయమును కాశీఘట్టమున చాటబోవుచున్నారా! (నవ్వును)

ఉగ్రసే: తమరయోమయముగా మాట్లాడుచున్నారు.

కమల: తమ యీ విజయవార్త, తోరమాణునకా, హర్షవర్ధనునికా, తెలుపబోవునది? (నవ్వును)

ఉగ్రసే: కాశీఘట్టమున తోరమాణుడేల యుండును, హర్షవర్ధనుడేల యుండును. అచట శశాంకుని రాణివాసమున్నది, వారికీ వార్తను గొంపోవుచున్నాను,

కమల: మీరాజకీయవేత్తల ప్రసంగములే.... కడు విచిత్రములు. అయిన యీ గొడవ నాకేల?.... ఒకపాట పాడుమనెదరా? (గొంతు సవరించుకొనును;)

ఉగ్రసే: (ఆతురుడై) కాదు. కాదు, మీ పల్కులు కడు విచిత్రముగా నున్నవి, మాకు వివరముగా చెప్పవలయును.

కమల: ఆఁ.... తమకు తెలియనివార్తలు మాకు మాత్రమెట్లుతెలియును. పాట పాడుదును, (గొంతు సవరించుకొనుచు)

ఉగ్రసే: (స్వగతము) ఇందేదియో గొప్పభావమిమిడి యున్నది, (ప్రకాశముగ) ఆర్యా! తమ పరిహాసముల నాపి, నా ప్రశ్నలకు తగిన సమాధానమిందు. వేడుకొందును. తోరమాణుడును, హర్షుడును కాశీఘట్టమున నేలయుందురు? ఈ మీ పల్కుల కర్థమేమి?

కమల : (తొందర తొందరగా) హిమాలయ ప్రాంగణమున హర్షుడును తోరమాణుడును సంధి చేసుకొనిరట! వారిరువురును వంగదేశము నాక్రమించిరి. కాశీఘట్టమున విడిసియున్నారు....

ఉగ్రసే : ఆ!....ఆ! ఇది నిశ్చయమగునా? (కంగారుగా లేచి నిలుచును)

కమల : పోనిండు....అబద్ధము....సరియా ?

ఉగ్రసే : అయ్యా తమరు కోపగింపకుడు, నిజము చెప్పుడు.

కమల : (నవ్వుచు) సేనాపతీ! యేమి నీ చాకచక్యము. వ్యర్థముగ నాచేత వాగింప నెంచితిరిగాని, తమకు సర్వము సంపూర్ణముగ తెలిసియేయుండును, దీనికేదియో, పై ఎత్తు వేసికొనియేయున్నారు. మీరుమాత్రము సామాన్యులా బాబూ!....రాజకీయవేత్తలు. రాజ తంత్రములు, సామాన్య ప్రజలకు మాకేమి యర్థము కాగలవు. మూఢులము........

ఉగ్రసే : తోరమాణ హర్షవర్ధనులు కాశీఘట్టము నాక్రమించుట, సత్యమే యగునా? తమకీవార్త నెవ్వడు చెప్పిరి ?

కమల : (విసుగుగా) ఎవరు చెప్పిరి? యీ కన్నులతో చూచితిమి. శశాంకమహారాజు, నాగానమువిని యేమైన బహూకరించునేమో యని కాశీఘట్టమునకు పోతిమి. పుళిందులు నా తాంబురా లాగుకొని, చెంపలు వాయగొట్టిరి. చావుతప్పి, కన్నులొట్టపోయి ఇచ్చటికి చేరుకొంటిమి బ్రతుకు జీవుడాయని.

ఉగ్రసే : (స్వగ) ఏమి యీచిత్ర సంఘటనము; తన వ్రేలితో తన కన్నేపొడుచుకొన్నట్లయినది మా చక్రవర్తిపని.........(ప్రకాశ) అయ్యా! మరి రాణిగారేమైరో తమకు తెలియునా!

కమల : (ఆలోచించి) ఆ!.........అదినాకు తెలియదు....ఆమె యేమైనదో....తెలియలేదనుకొనుచున్నారు.

ఉగ్రసే : (స్వగ) ఈ వార్తను తక్షణమే మహారాజున కెఱిగించవలయును. (ప్రకా) అవసరముగా నేనిప్పుడే పయనమైపోవలయును, సెలవు దయచేయుడు.

కమల : పాపము ! ఒక్కపాటవినుటకేవి వ్యవధిలేకుండపోయినదే!... పోయిరండు. ఒంటరిగా మాత్రము కాళీఘట్టమునకు పోకుడు. ప్రమాదము.

ఉగ్రసే : (విష్క్రమించుచుండును).

కమల (ఉగ్రసేనుని ఆపి) అ!.... చెప్పమఱచితివి. హర్షుడు స్థానేశ్వరమునకు పయనమగుచున్నాడనికూడ, నాటివదంతి.

ఉగ్రసే : (విష్క్రమించును)

కమల : నాయీ విషౌషధమిక నమోఘముగా పనిచేయగలదు, ఈ చదరంగపుయెత్తువ. యీ యేనుగు సరాసరివచ్చినదారి వెనుక పట్టినది. ఈ సందు చూచుకొని, ముందునకు నడచి, 'రాజ'ని ఆటకట్టించెదను, ఇంక కాలయాపనము చేయరాదు, ప్రతీకార సౌధమునకు పునాదివేసితిని. సౌధనిర్మాణమంతయు ముందే యున్నది.

శశాంకా ! యీ మహాద్యోతమున ప్రవీణులెవ్వరో పూర్తిగా తెలిసికొనవలయును.

ఈ భారతభూమి యొకమహాచతురంగఫలకము. రాజులు, సైన్యములు, ఆటకాయలు, ప్రత్యర్థులము నేను—నీవు.

—: గేయము :—

మహిళాప్రభా భాస : మానోగ్ర తేజమున<br>
స్ఫురితమై యీజగము : పూతమై పోవాలి ॥మహి॥<br>
నారాణిపరిభవము : నేనె తీర్చాలి<br>
నారాణి దుఃఖమును : నేనె మాన్పాలి ॥మహి॥

(విష్క్రమించును)

(యవనిక.)

# "నా రా ణి"

## తృతీయాంకము — తృతీయ రంగము

[అయోధ్య—రాజాంతఃపురమున నొకగది; రాత్రిసమయము. దీపము మిణుకు మిణుకుమనుచు వెలుగుచుండును. ఉగ్రసేనుడు యెదుట నిలువబడి యుండును. శశాంకుడు ఆలోచనా నిమగ్నుడై, చికాకుపడినట్లు అటునిటు నడచుచుండును ]

శశాంక: నీవంటి క్షుద్రజీవనులు బ్రతికియుండుటకన్న చచ్చుటమేలు. ........ఆ సత్రవేదికా పాషాణములపై తలపగులగొట్టుకొని మరణింపక, మరల నీ దుర్వార్తను మాకడకేల మూటగట్టుకొనివచ్చితివి? యీ ప్రచండ ధిషణా సంఘర్షణమున, నీవంటి విజ్ఞానశూన్యునిపై నాధారపడియుండుట మాది బుద్ధితక్కువ; నిన్నన వలసిన పనియేమున్నది.......ఆ గాయకమ్మన్యునేల బంధించుకొనిరావైతివి?

ఉగ్రసే: సంగీతము పాడుకొనుచు, శాలువ బుజానవైచుకొని, దేశములవెంటబిచ్చమెత్తి పొట్టబోసికొని కాలము వెళ్ళదీయువానిని నిష్కారణముగా బంధింపనేలయని యనుమానించితిని.

శశాంకు: మీయనుమానములే మాకవమానములను ఘటింపుచున్నవి! ........అతడెట్లున్నాడు?

ఉగ్రసే: బృహస్పతివలె నున్నాడు.

శశాంకు: తమవలె మేము బృహస్పతులను చూచి యేశ్వలేదు.

ఉగ్రసే: గంభీరమగు మూర్తికలదు. తీర్చిదిద్దినట్లున్నవి వాని కనుబొమలు. ఆకర్ణాంతములగు ఆ నేత్రములలో ఏదో ఒక మహా తేజము ప్రకాశింపుచున్నది.

శశాంకు : (వికటముగ) పాపమా శృంగారమూర్తినిజూచి దండనాథులకు విరహము గల్గినది కాబోలును !

ఉగ్రసే : ప్రభూ !..........

శశాంకు : ఛీ ! విజ్ఞానశూన్యుడా ! అతని శృంగారమూర్తి వర్ణనము, మాకేలకావలయును. అతడు సత్యవాదియే యగునా ! ఏమైన అనుమానముపైచినదాయని మా ప్రశ్న.

ఉగ్రసే : ఆ, సరస్వతీమూర్తి అబద్ధమాడగలరా ? అబద్ధమాడుటకు వారికేమియవసరము.

శశాంకు : అమాట నటుంచుము. ఏపుట్టలో యేపామున్నదో నీవెట్లు చెప్పగలవు. నీ కాతని మాటలయందు అంత విశ్వాసము కుదిరినదాయని అడుగుచున్నాము.

ఉగ్రసే : నిశ్చయముగ. యీవార్త సత్యమనియే నాయభిప్రాయము.

శశాంకు ; (స్వగతము) తోరమాణుడు యీ నైచ్యమున కొడిగట్టియుండువా ? ..........సామ్రాజ్యాకాంక్షసమాసక్తుడతడు; నైచ్యమేమున్నది. వాని వీలు వాడు చూచుకొనుచున్నాడు. మనతోడి సఖ్యమున కెందులకియ్యకొనినాడు సామ్రాజ్యకాంక్షచేతనే !

హర్షవర్ధనునితో పోరజాలక, అతనితో సంధిజేసికొనిన, మనల రాచి, వాపికేదో సులభముగా దోచిపెట్టునని వాడూహించుకొని యుండును.

భారత సింహపీఠమున పట్టము గట్టెదనన్న మాత్రలో
బీరముడిగ్గి, కుక్కవలె, వెన్వెనుకన్ జరియించెమాకు, మ
మ్మారడిపెట్టి, శాత్రవుల యంకముజేరెను, హర్షదేవియో
కూరుతునంచు, యిచ్చకపుకూతల గూయగవచ్చు వీనితో॥

ఈ తోరమాణ పిశాచము నాహ్వానించి యెంత వినాశము దెచ్చుకొంటిని.

ఉగ్రసేనా : పిడికిలిలోనుండి సామ్రాజ్యపదవి వ్రేళ్ళ సందుగా జారిపోవుచున్నది..........ఉగ్రసేనా....జారిపోవుచున్నది.... (స్ఫురితుడై) ఓహో : వైకల్యతా పిశాచము నన్నావేశించబోవు

చున్నది, అసమర్ధతాంధకారమా : నాదరికిరాకు; దూరముగా పో ....ఉగ్రసేనా : రోటిలో తలదూర్చితిమి: రోకటిపోటులకు ఇక వెరువరాదు. ఏసౌందర్యరాశి నన్నీ విషమప్రయత్నమున. కుదో్పి ధించెనో, దానిని అనుభవించెదను, లేదా. నశించిపోవుదును, సకల దిగ్దేశ రాజన్య కిరీట కోటీర మణిఘృణీ, కిమ్మీర పాదుండనై చండమార్తాండ ప్రభావిభాసినై, భారత సామ్రాజ్య రత్నసింహాస నము నధిష్ఠించెదను. లేదా, వినాశదేవతా భయంకర, క్రకచ కరాళ దంష్ట్రికా విదారితుడనై విధ్వస్థమైపోదును.........ఉగ్ర సేనా! యిక వెనుకంజ వైచుటలేదు.........సేనాపతీ! యీ మహోద్యమమున: నీవు నాకు విద్రోహమొనరింపక, మెలకువతో కార్యభారమును వహింపుము. ఈవంగసామ్రాజ్య కిరీటము నీది. ధరింపుము (తన శిరముపైనున్న కిరీటమును అతని శిరముపై నుంపబోవును)

ఉగ్రసే: (నివారించి) మహారాజా! వలదు, వలదు. వంగసామ్రాజ్య మిత్తునని నాకాసగొల్పనక్కరలేదు. మావంశమువారు విద్రో హులు గారు. చేతినిండ పోరాటము. కడుపునిండ భోజనము మాకు చాలును. రాజ్యభారమును నేను భరింపజాలను. ఆరాటము దప్ప దానియందు చేవిభవమును నాకు గోచరింపదు. క్షమింపుడు. నాకు తమరాజ్యములక్కరలేదు....కాలయాపనమునకు వ్యవధి యున్నట్లు గాన్పింపదు: భావికర్తవ్యమును నాజ్ఞాపింపుడు. ఆసా..తము నిర్వహించుటకు సిద్ధముగ నున్నాను,

శశాం: సేనాపతీ! సగము సైన్యమును దీసికొనిపోయి, ప్రభాతమగు సరికి, కాళీఘట్టమును ముట్టడింపుము, త్వరగా తరలిపొమ్ము. యిచ్చట తగిన ప్రతినిధిని నిల్పి, మరికొంత సైన్యమును దీసి కొనిపోయి, మేము స్థానేశ్వరమును ముట్టడింతుము, ఈ విప ర్యయ మూరకరాలేదు, ఏదో మహాకల్లోలమునకే వచ్చినది. పోయి రమ్ము. (ఉగ్రసేనుడు వంగి నమస్కరించి పోబోవ) ఆగుము! (దగ్గరగాపోయి భుజములపై చేయివైచి, నెమ్మదిగా) సైన్యము లన్నిటిని సరాసరివంగముసకంపి, కొలది పరివారముతోమాత్రము

మన రహస్య వనదుర్గమునకు బోయి అచ్చట గ్రహవర్మ బంధితుడై యున్నాడు. వానిని తలదీసిపొమ్ము.

ఉగ్రసే: ప్రభూ! యిప్పుడు దానికేమి తొందరవచ్చినది?

శశాం: నీకు.... తెలియదు.

ఉగ్రసే: చిత్తము. (నిష్క్రమించును)

శశాం: ఈ దుర్విషామిషాశనము ప్రాణోపద్రవమైనది. వైరివన విదాహమునకని ప్రజ్వలించిన, యీ కాలాగ్ని, నాచుట్టునే, భయంకర జ్వాలయై, నన్నే ఆక్రమించునాయేమి! తృష్ణాదూషితమగు యీ నా ప్రచండ హృదయమయ సభాభవనము నొక్కసారి ఆహుతి గొనునా యేమి? యెవరో యొకవ్యక్తి ఈ నా వ్యూహమునకు ప్రతివ్యూహము పన్నుచున్నట్లున్నది. ఈ మనీషాసమరమున ప్రత్యర్థియై నాతోడి ద్వంద యుద్ధమునకు గడంగి, బాహాబాహి పెనంగుటకు సర్వంకష ప్రభావిభాసితుడై, ముఖాముఖి నన్ను డీకొన వచ్చుచున్న యీ ధీశాలి యెవరై యుండవచ్చును? ఒకరా, లేక పంచభూతములను ప్రకోపించి, మహాసంవర్తమును సంఘటించి. యొక్కుమ్మడి నాపై మృత్యువును వర్షింపబోవుచున్నావా? ఈ మహాగోళము లన్నియు, నొక్కసారి నా శిరమును డీకొని, శతధాభిన్న మొనరించునా! యీశతఘ్నికాసందోహ మిప్పుడొక్కసారిగా, నాపై ప్రేల్పబడునా! నాపన్నిన పద్మవ్యూహము కొంత వరకు భగ్నమొనరింపబడినది. ఇంతకును ఆ కొండజాతి కుటిలునితో కరపీడన మాచరించుటచేత నే ఇంత మువిగినది.... చిత్రము. ఎంత ధర్మపన్నాగము లుపన్యసించు వారైనను, కటుకత్తి, గొంతుకపైకి వచ్చినప్పుడు, నెమ్మదిగా చలిమిడివలె, జారిపోవుదురు. తరుణోపాయమునకు గడంగుటయేగాక, అట్టితరి యెట్టి దుష్ప్రయత్నములకైనను వెరువరు. హర్షుడు మాత్రమేమిచేసినాడు? మాతృభూమి. మాతృభూమియని విన్నటిదనుక చిందులు ద్రొక్కినవాడు. నేడీ శశాంక పదాఘాతముల విధ్వస్తమై పోదునేమోయని, అలజడివడి, గండము తప్పుకొనుటకు, భారతదేశమునకు తిలకాయమానమగు నా వంగసామ్రాజ్యలక్ష్మిని ఆ హైందవ విరోధి కప్పనము జేయుచున్నాడు. ఓహో! యేమి దేశభక్తి!

కానిమ్ము. వైరులు సహితము అధర్మ యుద్ధమునకే గడంగు చున్నారుగదా! నేనిక పూర్తిగా విజృంభింపవచ్చును, ఈసంఘర్షణ మున నాకు విజయము చేకూరుట.... సంశయాస్పదమే. అయినను దీనికిప్పుడు చింతింపకూడదు. పరిభవసంక్లేశ వైక్లబ్యమునకన్న సర్వనాశనమే మేలు.

(తెరలో ఒక గంటదెబ్బ వినబడును)

అధికార పతనతా భయ సంక్షోభము నా హృదయమున భయంకర భూకంపముల నుత్పన్నము జేయుచున్నది. ఇంచుక విశ్రమించెదను. (పరుండి కొంత విశ్రమించి, తలనెత్తి) వైరి తేజమువలె, ఈదీపికాకిరణములు సైతము నాకన్నులలో పొడుచు చున్నవి..................శత్రుంజయా! ఈ దీపికను కొంచెము దూర ముగా నుంచుము (సేవకుడు దీపికను దూరముగానుంచిపోవును) (మరలకొంత విశ్రమించి నిద్రలో) వృద్ధజంబుకమా! పీయాటో పములు, శాత్రవ తమోమార్తాండుడగు శశాంకచక్రవర్తి యెదు టనా! పొమ్మావలకు (త్రుళ్ళిపడిలేచి) ఏమి! యీభయంకర దృశ్యము! విస్ఫులింగములవలె విప్పులు గురియుచు జేవురించిన కనులతో నామహామంత్రి శీర్షము నాకనులయెదుట పొడగట్టి హుంకరించు చున్నదేమి!..................నిష్కారణముగా మహా మంత్రిని తల గొట్టించితిని. ఈ యుపద్రవ సమయమున, ఆతడే దేని తరుణోపాయము దెల్పియుండడా!.............. ఛీ, ఛీ, పశ్చా త్తాపమునకు నాయందు తావెక్కడ? వృథగా మనోవైకల్యము నందగూడదు. ఈ వైరాశ్యకశ్మలమును దులిపివేయవలయును. సామ్రాజ్యమో! సర్వనాశనమో! రెండే అవధులు, (ముసుగుబెట్టి పండుకొనును. మరల ముసుగుదిగిచి) శత్రుంజయా?

శత్రుంజ: (ప్రవేశించి) దేవా!

శశాంకు: నీవు చేరువనేయుండుము. మేము పిలువవలసివచ్చునేమో పాపము, నీవు నిద్దురపోయినట్లులేదు, (మరల పరుండును)

శత్రుంజ: ఏమిటి యీలాలన! క్రొత్తగానున్నది! (నిష్క్రమించును) (తిరిగి ప్రవేశించి) జయము, జయము.

శశాంకు : (లేచి విసుగుతో) జయముకాదు, అపజయము; యేమి మునిగి నది ? నిశాచరుపవలె అర్ధరాత్రమున సహితము నాకు విరామము లేదా !..........నాకెక్కడి విరామము........

శత్రుంజ : దేవా ! మహారాణిగారివద్దనుండి, యొక కృషీవలబాలుడు వచ్చియున్నాడు,

శశాంకు : మహారాణి యెవరు ?

శత్రుంజ : పద్మావతీదేవిగారు,

శశాంకు : పద్మావతివద్దనుండియా ? ! కృషీవలుడా ! ఆమె యిప్పుడె చ్చటనున్నది ?

శత్రంజ : మహారాజుకు యేకాంతముగా నివేదించుకొనవలె నను చున్నాడు.

శశాంకు : త్వరగా లోనికిబంపుము. (శత్రుంజయుడు (నిష్క్రమిం మించును) ఆగ ! శ్రీమంతురాలగు నాపద్మావతి కేదేని యాపదరాలేదు గదా !

[ప్రవేశము కృషీవల వేషమున—కమల]

శశాంకు : కృషీవలయువకుడా ! యిటు కూర్చుండుము.

కమల ; (కూరుచుండును)

శశాంకు : (ఎగాదిగాచూచి తనలో) యీ వ్యక్తి పూర్వపరిచితునివలె నున్నాడే ! (ప్రకాశ) అబ్బాయీ ! నిన్నెచ్చటనో చూచినట్లున్నది !

కమల : (తనలో) వీడు నన్ను గుర్తించునా యేమి ? (ప్రకా) మహా రాజా ! చక్రవర్తుల దర్శనము క్షుద్రులగు మావంటి బీదలకెట్లు లభింపగలదు.

శశాంకు : ఇప్పుడు. నారాణి యెచ్చటనున్నది ?

కమల : (నలుదిక్కులు పరికించును)

శశాంకు : యువకుడా ! యేమట్లు చూచుచున్నావు ?

కమల : మహారాజా ! నాకేకాంతము కావలయును,

శశాంకు : ద్వారపాలకులూ ! దూరముగాపోయి నిలువుడు. మాకే కాంతము కావలయును. (కమలకు దగ్గరగా కూర్చుండును)

కమల : సరయూతీర వనమునందు, ఒక పర్వతగుహయందు, దాచ బడియున్నది తమ దేవి, ఇంతవరకును సురక్షితగానే యున్నది.

శశాంకు : తమ యాధీనములోనే యున్నదా ?

కమల : మహారాజా ! యెంతమాటాడితిరి ? మాయాధీనములో ఆమె యుండుటయా. ఆమె యాధీనములో మేమున్నాము.

శశాంకు : ఇంతకును తమ స్వగ్రామము ?

కమల : దేవా ! తమ పాలనలోని, విదురయను నొక చిన్న పల్లెలో నివసింపుచుందును.

శశాంకు : నా పద్మావతి మొదట తమ కెచ్చట కాన్పించినది ?

కమల : కాశీపట్టమును, తోరమాణ హర్ష వర్ధనులు హఠాత్తుగా నాక్ర మించిరి. మహారాణి యెట్లో ప్రాణముల దక్కించుకొని మా విదు రకు పారివచ్చిరి, అప్పుట దేవిగారిని మాయింట నుంచుకొని, కొంత సేదదీర్చితిమి. అటనుండుట క్షేమముగాదని నిన్నటి యర్థ రాత్రమున, ఆ శైల గుహాభ్యంతరమున జేర్చి తమకీవార్త నెరి గించి తోడుకొని పోవచ్చితిని.

శశాంకు : ఈ మృగయులు....సౌందర్యరాశియు, అమాయికయు, అబల యునగు, నాయీహరిణి నేల వేటాడవలయునో.

కమల : (వికటముగ) వేట తమకమున నున్నవారు యింత యాలో చింపరు. మహారాజా ! అట్టి సమయములందు మనము మాత్రము దయారసము జూపుదమా ?

శశాంకు : (స్వగత) ఇతడు, రాజ్యశ్రీపట్ల నాప్రవర్తనమును దెప్పి పొడుచుచున్నాడు; అవును. నేను విద్రోహమునకు గడంగినపుడు వారుమాత్ర మేల మన్నింతురు ? (ప్రకాశ) కృషీవలా : నావలన పద్మావతికెంత యలజడి వచ్చినది. పాపమామె నారాజదంపతులు నాయత్తమామలు, పువ్వులలోబెట్టి పెంచుకొనిరి. నిర్భాగ్యునకు నాకొసంగిరి. నాయవివేకమున నామె శైలగుహా పాషాణములలో అజ్ఞాతవాసము చేయవలసి వచ్చినది,

కమల : మహారాజా ! ఆమె సురక్షితయై యున్నారు. తమరు చింతింప వలదు.

శశాం: కృషిక యువకుడా! నీవు నా ధర్మపత్నిని నా కొసంగితివి. తీర్చరానిది నీ ఋణము. (హారమును దీసియిచ్చి) దీనిని స్వీక రింపుము. దినములు మంచివై, మరల కాశీఘట్టమునకు దంపతు లము మేముతిరిగి చేరికొనినప్పుడు, మా మనస్సుకు తృప్తియగు నట్లు నిన్ను బహూకరించుకొందుము.

కమల: (వారించి) ఇప్పుడు ఈ యల్పబహుమానము నాకు వలదు. తమకు మంచిరోజులే వచ్చిన అప్పుడు తమవద్ద పెద్దగా బహు మానము నందవలయును.

శశాంకు: నీవెంట కొంత పరివారము నంపెదము. నా గృహలక్ష్మిని నాకడకు చేర్పుము.

కమల: మహారాజా! (నవ్వును)

శశాంకు: (స్వగ) ఇట్టి వికట భ్రూకుటిని సహించుట కిదియే ప్రథ మము. (ప్రకా) ఈ నీహాసమున కర్థమేమి?

కమల: నా మహారాజు గొప్ప మేధావియని ప్రతీతి.... ఈ అనాలోచన యేమా? యని నాకు కొంత ఆశ్చర్యము కలుగుచున్నది.

శశాంకు: (స్వగ) ఎంత కఠోరప్రవచనము. (ప్రకా) అనాలోచనయా!

కమల: అనాలోచనగాక దీనినేమందురు? శత్రువులు పద్మావతీదేవి గారికొరకు నలుదిక్కులు గాలించుచున్నారే: ఇప్పుడు నేనొక సైన్యమును దీసికొని ఆమె నిగూఢముగా దాగియున్న ప్రదేశము నకు డప్పులు కొట్టుకొనుచు పయనమగుటలో యేమైన అర్థ మున్నదా! ఇంకేమున్నది? ఒక్కసారి కొంప మునిగిపోవును. సురక్షితమైయున్న యామెను. నిష్కారణము శత్రువులకొప్పగిం చుట యగును. నా ప్రయత్నమంతయు వ్యర్థమైపోవును. నన్ని చట నురికంబము నెక్కించినను సరియేకాని, నేనట్టిదానికి సమ్మ తింపను, అట్లయిన ఆమెను భద్రపరచిన ప్రదేశమును సైతము తమకిప్పుడు తెలుపజాలను.... పోయివచ్చెదను. శలవు దయ చేయుడు. (లేచును)

శశాంకు: (భయంకరముగ నవ్వుచు) ఈశశాంకుడొక మహాభూతము! వీని యెదుటనుండి దాటిపోవుట. నీవు తలచుచున్నంత సులభము గాదు.........వెళ్లివాడా! అటుకూర్చుండుము.

కమల : (బిక్కమొగము వైచి నెమ్మదిగా కూర్చుని) మహారాజా! తమ కన్నులవంక జూచిన నాకు భయము వైచుచున్నది. నన్ను చంపించెదరా ?

శశాంకు : భయములేదు, అటుకూర్చుండుము.........మమ్ము శాంతముగా క్షణము యోజించుకొననిమ్ము. (ఇటునటు తిరుగుచు యోజన నభినయించును)

కమల : (స్వగ) ఏమి. వీనియాటోపము ! వీనియందు ఇంతగాంభీర్యమున్నదా ? ఈ నా కార్యము ప్రమాదోపహత మగునట్లున్నదే !

శశాంకు : (తల పిడికిటితో మొత్తుకొనుచు) (స్వగ)నాలో యెన్నడునూ లేని యీకర్తవ్యతామౌఢ్యమేమి ? (ప్రకాశ) అబ్బాయీ ! మన మిప్పు డేమిచేసిన బాగుండునో చెప్పగలవా ?

కమల : (స్వగ) ఎలుం బోనులోపడినది. (ప్రకా) మహారాజా ! తమరీ రాత్రియే ఒంటరిగ నావెంట దయసేయుడు. రెండవప్రాణికి తెలియరాదు. ఉషస్సమయమగుసరికి, తమకు తమ గృహలక్ష్మిని చూపెదను. పగలంతయు తాముగూడ ఆ గుహాభ్యంతరముననే తలదాచుకొని రేపటిరాత్రికి బయలుదేరి, రెండవకంటివానికి తెలియకుండ సద్మావతీదేవిగారితోసహా మరల సేనావారమునకు చేరికొనవచ్చును. అంతియేకాని, యేమాత్రమాటోపము జేసినను ప్రమాదమువచ్చును.

శశాం : (స్వగ) ఏమి ఈ బాలకుని తీక్ష్ణబుద్ధి ! విజ్ఞాన విశేషమునకు వయసుతో అంతగా పనిలేదు. (ప్రకా) నన్నీ విపత్సాగరము నుండి నావయై తేర్చివైచుటకు మానవరూపమునందిన, మత్పూర్వకృతసుకృతమువలె నున్నావు. నీవెంట వచ్చెదను....నన్ను నా ప్రాణమున్నచోటికి శీఘ్రముగా జేర్పుము. (తెరలో రెండు గంటలు కొట్టుదురు) అదిగో ! అప్పుడే రెండు గంటలైనది. మనము తక్షణము పయనమైపోవుదము, నీవిటులనే కూర్చుండుము. క్షణములో వచ్చెదను. (లోనికిపోబోవును)

కమల : మహారాజా !

శశాంకు : (వెనుదిరిగి) ఆయుష్మంతుడా ?

కమల ; తమరు....లోనికిదేనికి ?

శశాంకు: ఆః కొంచెమేమైన పానీయముబుచ్చుకొని, కిరీటము ఖడ్గము, దెచ్చుకొనుటకు.

కమల ; ఆ(....ఏమియునులేదు; పొరబడి సేవకులతో ఈ రహస్యము తెలుపుదురేమోయని.

శశాంకు : లేదు లేదు ; శశాంకునకు కొంతవరకు మతి పోయినదికాని యింక అంతబొత్తిగా పిచ్చియెత్తలేదు. (నిష్క్రమించును)

కమల : ఈ సింగమిప్పుడు సాంగముగ బోనులో పడినట్లే. యిక విజయధ్వజము నెగురవేయవచ్చును. శశాంకా ! నేను నిన్ను తేల్పవచ్చిన సుకృతపుంజము ననుకొనుచున్నావా ? ఆ....హా ....హా !.... కాదు కాదు. నిన్ను తలపట్టి యమాలయమున కీడ్చుకొనపోవచ్చిన నీపురాకృత దుష్కృతమును, మహామృత్యువును నేను. రమ్ము రమ్ము. త్వరగారమ్ము.

శశాంకుడు : (తెరలో) శత్రుంజయా !

కమల : ఓహో ! సేవకుని పిలుచుచున్నాడు. ఒకవేళ వానితో నీవృత్తాంతము చెప్పునేమో ! (శశాంకుడుపోయినదిక్కై కొంనడచినిలచి) మహారాజా వృధాకాలయాపనము, కార్యభంగ మగునట్లున్నది ?

శశాం : (తెరలో) మిత్రమా ! క్షమింపుము. వచ్చుచున్నాను.

(ప్రవేశము : చెరయొకవైపునుండి; శశాంకుడు, శత్రుంజయుడు)

శశాంకు : శత్రుంజయా ! మేమొక రహస్యకార్యమును ఘటించుటకు పోవలసివచ్చినది. రేపటిరాత్రికిగాని రాము. సేనానాయకులందరును, అప్రమత్తులుగానుండవలెనని ప్రభుశాసనమైనదనితెల్పుము. (కమలతో) మిత్రమా ! పోయివత్తమా !

కమల : (వెనుక నడచుచు తనలో) పోవుదము. వచ్చుటెక్కడికి ? (ఇరువురు నిష్క్రమింతురు)

శత్రుంజ : ఈ వ్యక్తి యెవరు ?....యెచ్చటికీపయనము.

[ యవనిక ]

# "నా రా ణి"

## ద్వితీయాంకము — చతుర్థరంగము

(వధ్యశిల, చుట్టును పొదలు—ప్రవేశము, బాణుడు)

బాణు : ఈ కఠోర వధ్యశిలా ముఖమున ఎన్ని సాత్వికప్రాణములు తెగినవో! జడపదార్థమగు ఈ పాషాణమునకు సైతము యింతటి రక్తపిపాసయేమి? (అటునిటుకలయజూచి) సైనికులారా! మీరీ పొదలయందిట్లే నిశ్శబ్దముగా దాగియుండుడు. చీమయైన చిటుక్కుమనరాదు, నేనేదో మిషబెట్టి ఉగ్రసేనుని యొద్దనుండి ఘాతకుని విడదీసి ఆదారినటువచ్చునట్లు జేసెదను. వానిని హత్యజేయుడు. ఉగ్రసేనునితో నేను సంభాషణ కుపక్రమించి, చేసంజ్ఞ చేయుదును. ఒకరిద్దరుమాత్రమువచ్చి వాని నాక్రమింపుడు.... అదిగో! అప్పుడే దుర్గద్వారము తెరువబడినది. వారు గ్రహవర్మ మహారాజును తీసికొని దుర్గము వెలువడినారు. నేనుకూడ మెల్లమెల్లగా యీ పొదలలోనికి సర్దుకొనియెదను. (నిష్క్రమించును)

[ ప్రవేశము — ఉగ్రసేనుడు. బంధితుడై గ్రహవర్మ, ఘాతకుడు ]

గ్రహ : దండనాయకా! తమరు మాయందీనిష్కారణవైరమేల పూనితిరో తెల్పెదరా?.... పోనిండు రాజ్యకాంక్షచే నారాజ్యమును హరించిరి. బంధితుడనై మీ కారాగారమునందు పడియుండిన, కోరలుతీసిన త్రాచునుగదా! నిష్కారణముగా ఇప్పుడు నా ప్రాణములేల తీయవలెను?

ఉగ్ర : మహారాజా! నేను సేవకుడను; ఇది ప్రభుశాసనము. దాని యుక్తాయుక్తతను విమర్శించుటకు నాకెట్టి హక్కునులేదు.

గ్రహ : లేదు. ప్రాణభిక్ష యాచించుటలేదు.... సేనాపతీ! ఒకసారి నాచెరువునకిటు దయసేయగలరా?

ఉగ్రసే: (స్వగ) దగ్గరకు పోయిన హత్యసేయునేమో (ప్రకా) మహా రాజా! దేనికి?

గ్రహ: తమకొక రహస్యమును జెప్పకో వలయును.

ఉగ్రసే: (ఆలోచించుచుండును)

గ్రహ: దండనాధులేమో యోజించుచున్నారు?.... దగ్గఱకు వచ్చిన బంధితయగు ఈ శార్దూలకిశోర మేమైన పంజావిసరు నేమోయని భయపడుచున్నట్లున్నది. తమకాభయ మక్కఱలేదు. తమ కెట్టి యపాయమును చేయను. వాగ్దానము చేయుచున్నాను. ఇక్ష్వాకుని రక్తము నాళములలో ప్రవహించువాదెవడును మాటతప్పడు, తమకు తెలిసిన విషయమే. (ఉగ్రసేనుడు మెల్లగా గ్రహవర్మ యొద్దకుపోవును, గ్రహవర్మ ఆతని చెవిలో ఏదియో మెల్లగా చెప్పును.)

ఉగ్రసే: అమ్మయ్యో! (అని గుండెబాదుకొనును)

గ్రహ: తమకంతటి మనోబలములేదా?

ఉగ్రసే: లేదు; క్షమింపవలయును.

గ్రహ: అట్టి బలహీనులు ఇట్టి దారుణ కృత్యమున కెట్లొడిగట్టు చున్నారు?

ఉగ్రసే: నాప్రాణము నేను కాపాడుకొనుటకు.

గ్రహవర్మ: నాతల గొచిన మీకు వలసినంత రక్షణమున్నది. నన్ను వధించినచో మరుక్షణమునందే యీ ముప్పదిమూడుకోట్ల భారతీయులు ఒక్కుమ్మడి కవచఖడ్గాదుల ధరించి, తమ రక్షణార్థము ప్రతిఘటించినను రక్షింపబడరు, నాకంఠనాళములనుండి రక్తము స్రవించిన వెంటనే ఆయగ్ని పర్వతములు నాల్గును ఒక్కసారి రగుల్కొని మహాగ్ని జ్వాలముల వెదలగ్రక్కి, ఆసేతు హిమాచలము నొక్కసారి ప్రచండదావానల వాహినీసందోహములలో ముంచి మాడ్చివేయకపోవు. ఆ శతఘ్నికాచతుష్టయము తమపై నొక్కుమ్మడి మహాశనిసంఘాతముల విసరి వేయగలవు. వినాశమునందెదరు. జాగ్రత్తగా యోజించుకొనుడు. ముందుగాపారజూచుకొనుడు!

ఉగ్రసే: మహారాజా! మా చక్రవర్తి ధీమహిమయందు నాకు సంపూర్ణ విశ్వాసమున్నది. అదిగాక రాజద్రోహము చేయజాలను.

గ్రహవర్మ: అట్లయిన ఇప్పుడు.... మేమీ వధ్యశిలపై తెగిపోక తప్ప దనినమాట?

ఉగ్రసేను: (నిరుత్తరుడగును)

గ్రహవర్మ: కానిండు. (వధ్యశిలవద్దకు బోవుచు) ఉగ్రసేనా! గడచి బ్రతికినవారరుదు. (వధ్యశిలప్రక్కకూర్చుండి దానిపై తలమోపి, భయకంపితుడై తలనెత్తి) సేనాపతీ! నాకు మిక్కుటమగు జీవి తాశ అంకురించుచున్నది. నా హృదంతరాళమున చాల సంక్షోభ ముగానున్నది. నా హృదయమున ఇంచుక శాంతిచేకూరువరకు, అల్పకాలము నాశిరచ్ఛేదనము నాపింపగలరా?

ఉగ్రసేను: క్షమింపవలయును. నాకంతటి వ్యక్తిత్వములేదు.

గ్రహవర్మ: హత్యాసంఘటనమునకు వ్యక్తిత్వముగలదు? ప్రాణ సంరక్షణమునకుమాత్రములేదు? పోనిండు దైవప్రార్థనముచేసి

కొనెదను....ఇంచుక వ్యక్తిత్వముదెచ్చుకొని వ్యవధినొసంగగలరా? దాని కినీ తమ రసమర్థులా?

ఉగ్రసేను: చిత్తము. త్వరగా ముగింపుడు.

[ అ ను బం ధ ము 7. ]

గ్రహవర్మ: దేవా! ఈ చరాచర ప్రకృతియందు, సర్వవ్యాప్తమై, స్ఫురించుచున్న, నీమూర్తిని, నిమీలితనయనముల నారాధింపుచు. తన్మయతనందుచున్న నన్ను, కనికరములేక, ఈ ఘాతుకుని చండాసి కెరజేయుచున్నావేమి! నారక్తము మిషగా, ఈ భారత నాటకరంగమున, ఏదోయొక ప్రళయరూపక ప్రదర్శనా సంఘటన మునకు సంకల్పించినట్లున్నావు. ఏభయానకరసమును పోషింప బోవుచున్నావు, నీ యీ చిత్ర నాటకమున పాత్ర లెవరెవరు ధరింతురు!........

దేవా! కానిమ్ము, నీ యిచ్ఛవచ్చినట్లే కానిమ్ము. కాని యొక్కటిమాత్ర మనుగ్రహింపుము. ఈ నా హృదయ సంక్షోభ హుతాశనునందు

దుర్వారదుర్యోగదూషితయగు శశాంకపశువును హోమముజేసి, ఈ నీ పాలనమున ధర్మసంస్థాపనము చేయుము.........ఘాతకుడా ! పాపమహీమయాంధము తావులేక, నీపై యావిర్భవించి నట్లున్నావు. నీ పాపముల సంఖ్యకు దీనినికూడ కలుపుకొనుము; రమ్ము. (గ్రహవర్మ వధ్యశిలపై తలనుంచును. ఘాతుకుడు తల నఱుక నుంకించును)

బాణుడు ; (తెరలో) ఈ శిరచ్ఛేదనము నాపుడు !! ఇది శశాంక చక్రవర్తి శాసనము.

ఉగ్రసే : (స్వగతము) కర్ణపుటములు చిటిలిపోవునట్లీ పిడుగులురిమిన ప్రళయాంభోద మెవ్వరు!

బాణుడు : (ప్రవేశము: త్వరత్వరగా ఘాతుకునితో) నా వెంట పర్విడి వచ్చిన నా సేవకుడు స్పృహతప్పి అచ్చట పడిపోయినాడు. ముందు వానికి కొంచెము దాహమిచ్చిరమ్ము, (ఘాతుకుడు ఉగ్రసేనునివంక చూచును) వారివంక చూచెదవేమి ? పద, ముందాపని చూడు. ప్రాణములు పోవుచున్నవి.

ఉగ్రసే ; పోయిరమ్ము.

[ ఘాతుకుడు కత్తితో నిష్క్రమింప బోవుచుండును ]

బాణుడు : మహామృత్యు దంష్ట్రికవలె, చేతిలో ఆ పశువులను నఱుకు కత్తిదేనికి ? దాని నిచ్చట పారవేసిపో. కాళరాత్రివలె భయంకరమగు నీ ముఖముచూచినను. వాడు గుండెపగిలి చచ్చుటకు, (ఘాతుకుడు కత్తినచట పడవైచి నిష్క్రమించును)

బాణుడు : (గ్రహవర్మయొక్క కట్లు మెల్లగా విప్పుచుండును)

గ్రహవర్మ : (సహర్షముగా) మహా....

బాణుడు : (పెదవికొరకి మాటాడవద్దని సంజ్ఞ చేయును)

ఉగ్రసే : అగుడు ! ముందు ఆజ్ఞాపత్రమును మాకిచ్చి,బంధితుని విముక్తుని జేసికొనుడు,

బాణుడు : (లేచి ఉగ్రసేనుని డాయుచు) ఈ ఆజ్ఞ....వ్రాతమూలకముగా నొసంగబడలేదే.

ఉగ్రసే: సరి సరి!

బాణుడు: (నవ్వుచూ) లేదయ్యా! అప్పుడే కలవరపడు చున్నావు? (జేబులు సవరించుకొనుచు) ఓహో! యెచ్చటనో....జారవిడిచి నట్లున్నానే!

ఉగ్రసే: అట్లయిన వీలుపడదు.

బాణుడు: (నవ్వుచు) ఉన్నదయ్యా! నీకు పరిహాసములు కూడ తెలియవే?

ఉగ్రసే: ముందు చూపవలయును. ఇది యేటి పరిహాసము, ప్రభుశాసనములతో.

బాణుడు: (అరచేయి జేబునుండితీసి శూన్యహస్తము చూపుచు)ఇదిగో, చూడుడు.

ఉగ్రసే: శూన్యహస్తమును చూపుచు ఆజ్ఞాపత్రమనెద వేమి? నీవు పిచ్చివాడవు వలెనున్నావే?

బాణుడు: నేనా?—నీవా?

ఘాతుకుడు: (తెరలో) అమ్మయ్యో! శత్రువులు. కత్తితో పొడిచిరి.

ఉగ్రసే: (కత్తిపై చేయివైచి పరుగెత్తబోవుచు) వచ్చుచున్నాను, భయములేదు.

బాణుడు: (చేయిపట్టుకొని ఆపి) ఇది చక్రవర్తిశాసనము. ముందు దీనిని చూచెదరా? పోయి మీశాసన ధిక్కారమును చక్రవర్తికి మనవిచేయుమందురా?

ఉగ్రసే: అట్లయిన త్వరగా చూపుడు.

బాణుడు: (మరల శూన్యహస్తమును పైకెత్తిచూపుచు) ఇదిగో చూపుచున్నాను. చూడుడు.

ఉగ్రసే: ఏదీ?

బాణుడు: (ఎడమచేతితో సైనికుల రమ్మని సంజ్ఞ చేయును) ఇదిగో! పుచ్చుకొనుడు; (కుడి చేతినిచాచి చెంపపై కొట్టును)(ఉగ్రసేనుడు నిర్ఘాంతపడి నిలుచును. ఇరువురు సైనికులు ప్రవేశింతురు)

ఉగ్రసే: ఎంత మోసము! (కత్తిపై చేయివైచును)

బాణుడు : (సైనికులతో) చూచెదరేమి ? బంధింపుడు. (సైనికులు బంధింతురు) వ్యవధిలేదు. ఆ ఖడ్గమును తీసికొనిపోయి, వీనిని శిరచ్ఛేదము చేయుడు. (గ్రహవర్మ కట్లు విప్పుచుండును)

ఉగ్రసే : ఇంత అన్యాయమా !

బాణుడు : శుద్ధ....

ఉగ్రసే : క్షమియింపరా !

బాణుడు : నీవలె, నేనునూ, సేవకుడనేనోయీ! నాకునువ్య క్తిత్వములేదు.

ఉగ్రసే : తమరు సర్వస్వంతంత్రులు. నాకు తెలియును. గుర్తించితిని. మహామంత్రులు, బాణులు.

బాణుడు : ఓయీ ! మేము దౌష్ట్యమారణ హోమమునకు మహారంభం చేసితిమి. ఆరంభమునందే హంసపాదమా ? ఊఁహుం....లాభము లేదు. (తీసికొనిపొండని సైనికులకు సంజ్ఞ చేయును. సైనికులట్లు చేతురు)

బాణుడు : (గ్రహవర్మతో) మహారాజా !

గ్రహవర్మ : దేవా !

బాణుడు : ఆదుర్గమునందెంత పరివార మున్నది ?

గ్రహవర్మ : ఏబదిలోపు— ఆ సైనికుని ఖడ్గము తీసికొనిపోయి తెగ నరికి వత్తునా ?

బాణుడు : ఈ ఆ వేశమే వద్దనినది, ఆపని చేయవలసినవారున్నారు.... సైనికులారా ! లెండు. ఆ దుర్గము తలుపు తెరచియేయున్నది. లోనికిజొరబడుడు. ఊచకోతకోయుడు (సైనికులు నిష్క్రమింతురు)

గ్రహవర్మ : దేవా! ఇచ్చట నెంత సైన్యమును దాచితిరి!

[ ఉగ్రసేనుని తీసుకొనిపోయిన సైనికులు ప్రవేశము ]

బాణుడు : పని, ముగిసినదా?

సైనికులు : చిత్తము.

గ్రహవర్మ : దేవా! తమరిచ్చటి కెట్లు వచ్చితిరి?

బాణుడు : సావధానముగా తెల్పెదను.

గ్రహవర్మ : మనముకూడపోయి ఆ తుములమును వీక్షింతమా?

బాణుడు : వ్యవధిలేదు: అమ్మాయిని వెదుటకు పోవలయును. ఆమె జాడ లింకను తెలియలేదు.

గ్రహవర్మ : నాకు తెలియును.

బాణుడు : ఆ ?

గ్రహవర్మ : నాకు తెలియును. నేను వారినొక రహస్య ప్రదేశమునకు పొమ్మంటిని. తప్పక వారచ్చటనే యుందురు.

బాణుడు : అట్లయిన మనము, ముందా ప్రదేశమున కరుగుదము.
(అందరు నిష్క్రమింతురు)

[యవనిక]



# " నారాణి "

## తృతీయాంకము — పంచమ రంగము

[ ప్రవేశము — కృషీవల వేషమున ముందునడచుచు కమల; వెనువెంట శశాంకుడు; కీకారణ్యము, మంచుతెరలు ]

శశాం : ఈ కీకారణ్య మహామృత్యు గహ్వరాంతరము నుండి యమ కింకరునివలె, ఎచ్చటికి నన్నీడ్చుకొని పోవుచున్నావు. ఈ కఠోర కంటక శిలాపథమువెంట నీ పయనమింకెంత కాలము !

కమల : దాపురించినది.

శశాం : మంచుతెరలుగప్పి యీవనభూమి, నా మానసమువలెనే అయో మయముగా నున్నది.

కమల : క్షణములో సూర్యప్రకాశమావిర్భవించి, యీ మంచుతెర లను పటాపంచలు చేయగలదు, అప్పుడు ఎల్లెడల తేజమే.... అయినను మహారాజా ! మనకాతేజముతో పనియేమున్నది. దిన కర కిరణ ప్రకాండము ప్రభలురేగక పూర్వమే గమ్యస్థానమును చేరగలము,

శశాం : కృషీవలా ! కొంచెమాగుము, ఇంకెంత దూరము నడువ వలయును ?

కమల : చేరువకు వచ్చితిమి.

శశాంక : ఇక మేము నడువజాలకున్నామే?

కమల : దాపునకు వచ్చితిమి; అదుగో, ఆ కనుపించుచున్న ఆ కొండ చరియయందే యున్నదా బిలము.

శశాం : కృషీవలా ! (ఆకొండవంక చూచుచు చకితుడగును.)

కమల : మహారాజా !

శశాం : మేమచటికిరాము,

కమల : చక్రవర్తీ !

శశాం : ఆఁ!....ఏమీ! .... ....చక్రవర్తి మాత్రము భయభ్రాంతుడు కాగూడదా ?

కమల : భయమున కేమున్నది !

శశాం : నీవు ప్రమాదమును సైతము గుర్తింపజాలని, అవ్యక్తుడగు పసిబాడవువలె నున్నావే! నీవెంట పయనమై యీ కొనలబడి వచ్చి, నాగొంతు నేను కోసుకొను చున్నట్లున్నానే....కృషీవలా ! ఆ పిశాచముల లోనికి పొమ్మనియెదవేమి !

కమల : తమరు వ్యర్థముగ విభ్రమోపహతులగుచున్నారు; పిశాచము లెక్కడ ?

శశాంకు : ఆ కొండచరియలలోచూడు.

కమల : ఏమున్నది ?

శశాంకు : జడలు విరియ, పర్వతోపమానములుగా, భయంకరమూర్తు లనుదాల్చి, ఆ లోయనంతను తమోయుక్తముగా జేసిసైచు చున్నవి, చూడు....చూడు అటు చూడు.

కమల : అవి....పిశాచములు కావు. చీకటిచెట్లు.

శశాంకు : ఆ చైతన్యమో ?

కమల : ఆ వృక్షములు మారుత సంచలితములు, సహజ చైతన్యము కాదది.

శశాంకు : అవుగాక ! వానియందు మాకు పైశాచిక భ్రాంతికలుగు చున్నది. దానివలన నా హృదయము కొంత చలించుచున్నది.

కమల ; విద్రోహమానసులవలె, జడపదార్థములను సైతముజూచి భయ పడుచున్నారే.

శశాంకు : భయముకాదోయీ ! తుపానులో చిక్కిపోయినప్పుడు: నావికుడెంత జాగ్రత్తగా నడుపుచున్నను, ఓడ కొంచెము ఇటు నటు చలింపకపోదు.

కమల : అట్లయిన దయసేయుడు. (ముందునకు నడచును)

శశాంకు : ఆగుము. నా హృదయవారాశిపై, ఏదో ఉప్పెన లేచినట్లు న్నది, అల్లకల్లోలముగా తరంగములు రేగుచున్నవి. కొంచెము మాకు విశ్రాంతికావలయును. (క్రింద నెమ్మదిగా వ్రాలి కన్నులు మూసుకొని పరుండును)

కమల : (అటునిటు తిరుగుచు తనలో) ఈవిషభాండమున పొంగులు రేగుచున్నవి. తనంతదాశతధాభిన్నమగునట్టున్నది. ఈకాలసర్పము పూసకట్టుకట్టిన విధాన. కదలమెదలలేకుండా పోయినది. ఈమహా జలపాత మిట్టింకులింకినది. ఈ హాలాహలజ్వాలలు చప్పున చల్లారినవి. అలలేచెడి ఈ సముద్రసంఘోషణము సమసిపోయి నది.........ఇకకాలయాపనముచేయరాదు. ఈదౌష్ట్యదావానలమును సంపూర్ణముగ నార్పివేయవలయును, ఈ విషాహిని పూర్తిగ తల చిదుకగొట్టింపవలయును.........శశాంకా ! ఈ ప్రచండ ధిషణా సంఘర్షణమున విజయులెవరు ? అధర్మానుసారివి. పశుబలోన్మత్తు డవు, మహారాజకీయవేత్తవు, మగవాడవు. చక్రవర్తివి. నీవా ? ....ధర్మానుసారిణిని, బలహీనను, ఆడుదానను, బావిసను నేనా? (శశాంకుని సమీపించి) మహారాజా !

శశాం : కృషీవలా ! క్షణమాగుము, పయనమై పోవుదము.

కమల : ఆర్యా! తమరిచ్చటనే క్షణమువిశ్రాంతి దీసుకొనుడు. అదుగో. ఆసరోవరతీరమున ఇంచుక కాల్యముల దీర్చికొనివచ్చెదను.

శశాం : ఒంటివిడచి పోవుదువా; చక్రవర్తులముగనుక పరివార విహీ నులమైయుండుట కలవాటుపడి యుండలేదే !

కమల : సపరివారముగ గమ్యస్థానముచేరెదరుగాక, క్షణమోపికపట్టుడు

శశాం : నీవుపోవుటకు వీలుపడదు. ఆజ్ఞాపించు చున్నాము.

కమల : పోకతప్పదు. క్షమింపుడు. తమయాజ్ఞను నేనుపాలింపజాలను.

శశాం : అమాయకుడా! యిదిచక్రవర్తి శాసనము.

కమల : ఆహాహా........

శశాం : నీయీ వికటాట్టహాసమున కర్థమేమి? ప్రభుతిరస్కారమా ?

కమల : ప్రభువు....ప్రభువు....ఎవరికిప్రభువు....ప్రభువనగా పాలించు వాడు, తమరు విధ్వంసకులు, తాము ప్రభువెవరికి ?

శశాం : బానిసా! ప్రభువునీకు, ఈ భారత సామ్రాజ్యమునకు....

కమల : ఈ భారతసామ్రాజ్యాధిపతి హర్షవర్ధన చక్రవర్తి! తాము చక్రవర్తులుకారు—ఏలినవారి బానిసలు.

శశాం : తులువా! హర్షుడు సామ్రాజ్యాధిపతియా? మేమాతని బానిసలమా! ఇదియంతయు మోసమేయగునా!

కమల :

దంభముపన్ని, యౌవనమదంబున కన్నులు కానరాక, సంరంభముజేసి, స్త్రీజనముర, యిది, నీచప్రవంచనెంచకే
శుంభదవార్య వీర్యయగు శోభనగాత్రి ప్రదీయ రాజ్ఞిపై
జృంభణమున్ పొనర్చి, హతజీవనుడైతివి చింతయేలరా!.

(పారిపోవును).

శశాం : నిలు, నిలు! చండశాసనుడగు శశాంక చక్రవర్తి శాసనమును ధిక్కరించుచున్నావు ఎవడవురా, ముందు నీ పేరుచెప్పు?

కమల : (తెరలో) ఈ లోకైక కంటక విలుంఠని కమల! ...

శశాం : మాయావీ! పిశాచీ!! రక్కసీ!!! (కమలను వెంబడించి, క్షణమాగి తిరిగివచ్చి) లేడివలె చెంగున దాటిపోయినది, పోవును ఎంతదూరము పోవును. పిశాచీ! ఈ చరాచర మహాభారతమున ఆసేతుహిమాచలము నీ వెచ్చటదాగినను, నీవు నా దారుణ కృపాణ ధారా విలుంఠితవు కాకపోవు. రహస్య బిలమార్గములవెంట రసాతలమునకు దూరిపోయినను, కాలాహివై, వెన్నంటి నిన్ను కాటందక పోను. దుర్మతీ! ఈ విషాద్యయ మంతయు, నీవు సృష్టించుచున్నదేనా! నా సేనా బడబానలము నంటించి ఈ కీకారణ్యమును దహించి, అందు నిన్ను మాడ్చివేయుదును ఈ అగ్నికి నీవెదురా ఈ సింహమును కదలింతువా! ఈ గంభీర శతఘ్నికాముఖమున కెదురునిల్చి నీ వెకలి నటనమా....నీవు, నీ రాణి నీ రాజు, మీరందరు, ఈ నా ప్రళయతాండవమున చిదుకద్రొక్కి వేయబడుదురు. ఈ నా ప్రళయ ప్రభంజనోపహతి.... ....ఉప్పెనలు రేగిపోవుచున్న ఆ విలయాంభోరాశిలోనికి విసరివేయ బడుదురు. మీ సర్వనాశనముతో సామ్రాజ్యమును ప్రతిష్ఠింతును. (పోబోవును)

[ప్రవేశము : రెండవవైపునుండి దీర్ఘనాగు ఖడ్గమును ధరించి రాజ్యశ్రీ]

రాజ్యశ్రీ : విషాహి ! శరోత్కటకుడా ! నిలు !

శశాం : (వెనుదిరిగి చూచి. భయాశ్చర్యములతో) సాక్షాన్నిశుంభ, సంహారిణి వలె, ఈ భయంకరమూర్తివి.... నీ వెవరు ?

రాజ్యశ్రీ : క్రక్కు....క్రక్కు....నీవు వెడలగ్రక్క దలచిన విషవహ్నినంతయు, ఒక్కసారిగా వెడలగ్రక్కుకో ! నీ పడగలు చిదుకగొట్టివేయుటకు వచ్చితిని....నన్నే గుర్తుబట్టజాలకున్నావురా !

శశాం : నీవా !....

రాజ్యశ్రీ : నేనే....

శశాం : గాంధర్వమను మిషతో, మేనత్తకొడుకును తగుల్కొనిపోయినది నీవేనా ?

రాజ్యశ్రీ : (తనలో) కఠోరసంభాషణుడా ! (ప్రకాశముగ) నిశితశరాగ్రమున. శశాంక దండనాధుని నిర్వీర్యుజేసి, చెంపలు వేయించినది నేనే !

శశాం : ఈ నీ భీభత్సరూపమును ఉపసంహరింపుము, కౌగలించుకోవలయును.

రాజ్యశ్రీ : (బొడ్డులోనుండి వేరొక చిన్నబాకును లాగి, కొనను బట్టుకొని) వినవుదువా ?

శశాం : క్షణమాగుము.... నేము ద్వంద్వయుద్ధము చేయుదుము.

రాజ్యశ్రీ : క్షణమాత్రము వ్యవధి....దుఃఖింపవలసినదంతయు దుఃఖించుకో ! (ఒక చెట్టుచాటునను నిష్క్రమించును)

శశాం : ఓహో ! ఈ మహోపాయపు సంఘటనమున, ఈ పంచాననమే బంధింపబడినది. ప్రకృతిలింపపటుడై పతితమించు, చైతన్యపూరుషునివలె, అభ్యాసముచేసికొని తహతహలాడిపోవలసవచ్చినదే ! మృణాళనాళములని భ్రమించి, ఈ విషవ్యాళముల మోపుగట్టి మూపునదాల్చితిని. ఇవి బుస్సుబుస్సుమని, విషానలజ్వాలల విసరుచు, నన్ను కాటందుచున్నవే ! సేనావరమునుండి పారబడి యొంటిమై ఇటువచ్చి, వ్యర్థముగ నశించి పోవుచున్నానే.... నశించిపోవుచున్నానే....(స్ఫురితుడై) కాదుకాదు! నా బలమునంతయు నొక్కమ్మడి జృంభించి ఈ మృత్యుముఖమునుండి తప్పిం

చుకొని, యొక్క యుమటన సేనావారమునందు పడిపోయెదను.
(పారిపోవును)
(రాజ్యశ్రీ ప్రవేశము : దాసుకొనబడ్డకొని విసరుట నప్పు ఖుంచి)

రాజ్యశ్రీ : పారుబోతూ! వెనుదిరిగెదవా, విసరనా? తిరుగు....విసరె దను, జాగ్రత్త. ఇదుగో విసరుదును.

శశాం : (ప్రవేశించి) చక్రవర్తులు స్వయముగాపోరరు. సేనను తెచ్చు కొందుము.

రాజ్యశ్రీ : అఁ....

శశాం : చక్రవర్తిని నన్నాడుదానిపై చేయిచేసుకొమనెదవా ?

రాజ్యశ్రీ : అహాహహా! కుసకముపలె నీకును, అప్పుడప్పుడు కాశీ యాత్ర పోవలయునని బుద్ధిపుట్టుచున్నట్లున్నదే,

శశాం : రెండు నిమిషములలో తిరిగివచ్చి నీకు ఖడ్గచాలనము నొసం గెదను. అప్పుడు లక్షలకొలది కత్తులు నీపై తాండవింపగలవు నన్ను పోనిమ్ము. ఒక సామాన్య సైనికునివలె రణభూమియందు నిలచిపోరాడు అలవాటు నాకులేదు.

రాజ్యశ్రీ : ఈసింహి. ఈ యాముషమును విడుపజాలదు; ఈ నిశుంభ సంహారిణి, ఈ దైత్యుని విడువజాలదు, పగకొన్న ఈ గోదుమ వన్నె త్రాచు....కాటందక నిన్నిపుడు విడువజాలదు.

శశాం : ఇది రాక్షస కృత్యము....

రాజ్యశ్రీ : దుర్మతీ! ఇప్పుడు నీకు ధర్మ పన్నాగములు కావలసి వచ్చెనా ?

శశాం : (కత్తిదూసి) వ్యభిచారిణీ! ఈ భారతభూమిని నిష్కంటకము నొనరింతును రమ్ము.

రాజ్యశ్రీ : (కత్తితో శశాంకుని కత్తిపై దెబ్బవేసి) క్షణములో భారత సామ్రాజ్యము నిష్కంటకము .... ....(ఇరువురును యుద్ధము చేయుదురు)

కమల (ప్రవేశము) భర్తృదారికా! కోయుము వీనితల గోయుము. వీడు పాడుబోతు. ఆలసించిన కాలికి బుద్ధిచెప్పును.

[ యవనిక ]

# " నా రా ణి "

## తృతీయాంకము — షష్ఠమరంగము

[ వనప్రదేశము। ప్రవేశము కమల, తెరలోనికి చూచుచు ]

కమల : కుంభికుంభ విచ్ఛేదనక్రియా చణయగు సింహివోలె, నా రాణి ఆ మదగజముపై నెట్లు దుముకుచున్నది.... ....నా రాణియందు యింత పరాక్రమమున్నదా ! ఈ చండికా తాండవమేమి ? ఏమి యీ భయంకరిమూర్తి ! ఆసేతుహిమాచల మెక్కుమ్మడి కవచ ఖడ్గాదుల ధరించి, ఎదురు నిల్చినను, యీమె నిష్పడాగలేరు.... శశాంకా ! గం... తెరలో తలదూర్చితివి; ఇప్పుడేమి చేయగలవు? ఆ! వాడును విజృంభించు చున్నాడు. కుడిచేతితో యుద్ధము చేయుచు, ఎడమచేతితో బొడ్డులోనుండి బాకును దీసినాడు. రాజ పుత్రి చూచినదో లేదో! (బిగ్గరగా) అమ్మా ! బాకు బాకు.... .... ఓహో ! ఏమి ఖడ్గచాలనము! ఒక్కవ్రేటునలెగి, ఆతని బాహువు బాకుతోకూడ గగనమునకె వ్రైగిరిపోయినది, యెంతదూరముగా విసరివేయబడినది .... భీష్మాకృతిదాల్చి వాని నాక్రమించి, కేశ బంధమును ఎడమచేతితో పెనవైచి పట్టుకొనినది.... ....అమ్మా! నరుకు, నరుకు, వెయ్యి....దెబ్బ....గెలపట్టి తాటికాయను తెగ వేయునట్లు: కేశచ్ఛటపట్టి, వీనితల నొక్కవ్రేటున తెగనేసినది. ఈ భారతము ఈ క్షణముతో నిష్కంటకము.

దౌష్ట్య తిమిరాంధకారంబు తరలిపోయె,
చటుల జీమూత సంఘంబు సడలిపోయె,
హైమ యవనికాభ్యంతరం బంతరించె,
విమల సూర్యోదయారంభ వేళయయ్యె!

(ఇచ్చట రంగముపై ఎఱ్ఱనికాంతిని ప్రసరింపవలెను)

ఏమి ఈ భయంకర రూపము ! ఏమి ఈ భీభత్సదృశ్యము, రాజ పుత్రికి మతిభ్రమణము కల్గినది....ప్రళయ పరిభ్రాంతులై, నిష్ఫాకల

రాల్చుచు, గిరుగిరున తిరుగిపోవు. చండభాను ద్వయమువోలె, ఆమె కన్నులు లెంతె భయంకరముగానున్నవి. నడుమ నడుమ, అభయంకర వికటాట్టహాసములు మహాశనిసంఘాతముల జలజల రాల్చుచున్నవి. (బిగ్గరగా) అమ్మా! భర్తృదారికా! నాతల్లీ!

రాజ్యశ్రీ : (కెరలో) తృష్ణ! తృష్ణ! దాహము! తృష్ణతీరినదా!!! తీరినదా తృష్ణ !!!

(ప్రవేశము :- రాజ్యశ్రీ : ఎడమచేత శశాంకుని శిరము ధరించి, రక్తవదనయై ; కుడిచేత ఖడ్గము, భీభత్సరూపము, చేతనున్న శిరమువంక జూచుచు, చకితయై)

రాజ్యశ్రీ : తృష్ణ! తృష్ణ! తృష్ణ! దాహము....సౌందర్య ముగ్ధుడు.... భయంకరముగానవ్వి) సౌందర్య ముగ్ధుడు....ముగ్ధుడు. సౌందర్యము. ముగ్ధుడు నీకు రాజ్యశ్రీ కావలయునా! కావలయునా? కావలయును! (వికటముగనవ్వి) ఇదిగో! ఇదిగో! ఏమిచేసికొనియెదవో చేసుకో! .... రాట్కుమారీ! మేము చక్రవర్తులము!.. చక్రవర్తులు !... చక్రవర్తులు ! చక్రవర్తులూ ! శరీరమేమి చేసుకొనిరి ? తలమాత్రమే మిగిలినదేమి ?

కమల ; అమ్మా !

రాజ్యశ్రీ : చక్రవర్తులు కమలా! చక్రవర్తులను నీవెప్పుడు చూడలేదా! ఇట్లే యుండెదరా ? (శిరమునెత్తి కమలకు చూపుచు) చక్రవర్తులిట్లే యుండెదరు ? కరచరణాద్యవయవము లుండవు.... చక్రవర్తులు.... యేబదిలక్షల సైన్యమున్నదే.... రక్తప్రవాహము.... రక్తప్రవాహము.... కారాగారవాసము .... బలప్రయోగము.... మానభంగము.... మానభంగము.... శశాంకా! మాకు మానభంగముకాదు; నీకు ప్రాణభంగము. ఆటోపమణగినదా? శశాంకా! ఒరేచక్రవర్తులు....ఉద్దండుడని తోరమాణుని దాసటగా బిలిచితివిగదా! నేను నీకుత్తుక తుణుముకొని పోవుచుండ, వాడు రాలేదేమిరా నిన్ను కాపాడుటకు?....రాలేదేమిరా? ఆసింహము ఆ ఏనుగునుకూడ చీల్చివైచినదా యేమిరా! (శిరమునెత్తి కన్నులవంక చూచుచు) రెప్పవాల్చక చూచుచున్నావే! అమ్మో! కమలా! (కమలచెగ్గరకు పర్విడివచ్చి) కమలా! కమాలా!! ఈ పిశాచము నాకింక హుంకరించుచున్నదే! ఈ రక్కసి నన్ను

మ్రింగవచ్చుచున్నాడే!....(భయము నభినయించుచు....శశాంకుని శిరమును పారవేయ ప్రయత్నించి విదలించుచుండును....కాని విడువలేదు. కత్తి క్రిందపారవేయును....కమలను భయభ్రాంతయై కౌగలించికొని, కన్నులు మూసుకొనును) అమ్మో! పిశాచము.... దయ్యము....రక్కసి.... అమ్మో! కమలా, కమలా, కమలా!

కమల : (రాజ్యశ్రీ చేతనున్న శిరమును వదలించి దూరముగా పారవేయును)

రాజ్యశ్రీ : మ్రింగకు, మ్రింగకు, నన్ను మ్రింగకు, నిన్ను చూడలేను. పో....పో....నా యెదటనుండిపో....మ్రింగకు. నన్ను మ్రింగకు! బ్రతిమాలుకుంటాను, నన్ను మ్రింగకు (అని గజగజ వణకును)

కమల : (రాజ్యశ్రీని కూర్చుండబెట్టి శిరోజముల నిమురుచు కౌగలించుకొని) భర్తృదారికా!....తల్లీ! నేను కమలను........ఇటుచూడు. భయములేదు. నావంకచూడు. (అని బిగ్గ కౌగలించుకొనును)

రాజ్యశ్రీ : (మెల్లగా కనులువిప్పి) కమలా!

కమల : తల్లీ! యెంత విభ్రమము కల్గినదమ్మా!

రాజ్యశ్రీ : (నెమ్మదిగా) కమలా!

కమల : అమ్మా!

రాజ్యశ్రీ : నాలుక బొడ్డుదగ్గరకు యీడ్చుకొని పోయినది, మాటలాడుటకు శక్తిలేదు.

కమల : దాహము వైచుచున్నదా? గుహలోనికిపోయి. చల్లనినీటిని తెచ్చెదను, (రాజపుత్రిని మెల్లగా పరుండబెట్టి లోనికిపోయి తిరిగి పాత్రతో ప్రవేశించును)

రాజ్యశ్రీ : (దాహము పుచ్చుకొని)

గుత్తులు, గుత్తులై ప్రిదులుకొన్న మహత్తర, కామపుష్ప సంపత్తి. హృదంతరాళములపై తమకంబును బెంప, యౌవనోన్మత్తత, నాగకాముకులు మైమయి తన్మయులైన, తానత ప్మాత్తుగ, నాగ పుత్రకునిబట్టి, వధించి, మనంగ నేర్చనే.

పగ సాధించితిని! ప్రయోజనమేమున్నది?

కస్సుబుస్సనిరేగి, తోకపయిలేచి,
కసరి విషవహ్నికీలికల్ విసరుగాక,
మించి హంతకు భస్మీకరించుగాక,
కలుగునే పన్నగికి, భర్తృకౌగిలింత.

కమల: అమ్మా! శత్రూన్మూలనమైనది. పగసాధించితివి. ఈయుద్రేకమునశమించుకొనుము. హృదయమును శాంతిపరచుకొనుము.

రాజ్యశ్రీ: నాకింకను శాంతియా కమలా! నాశాంతి నానాధునితోనే వినాశమైనది. నా ప్రణయ సామ్రాజ్యము భగ్నమైపోయినది. నా జీవనాలంబనము, ఘాతుక కిరాత దుర్వార దుర్దాంత నిష్ఠుర కఠోర కుఠార ధారా విలుంఠితమైనది. నా ప్రణయ పేశల సుకుమార కోమల శిరీష కుసుమము, నా మూర్ధముపైనుండగనే, పాషాణ హృదయులగు కటుకు ఖొులకులచే, నలిపివేయబడినది. ఫల పుష్పోన్ముఖమై, జగదానందకరమై, నవనవలాడుచున్న నా ప్రేమాపున్నాగము కూకటివేరుతో పెకలింపబడినది, మేఘమాలికా పరిశోభితమగునవి, తారకానికర విరాజితమగునవి, ఆయున్నత పర్వతాగ్రమున నిర్మించుకొనిన నా లీలావసధము, మహాశనికాపాతాఘాతముల భగ్నమైపోయినది....కోమలమైన నా హృదయ లవలీదళము కఠోర కంటక విదారితమై, జర్జరీభూతమైనది. లలితమగు నా హృదయఫలకముపై నెంతటి సమ్మెటపెట్టు పడినది....నాపై పగబూనినవాడు శశాంకుడు, నన్ను కరకు ములుకుల కెరజేయరాదా! తీక్షణతర నారాచముల నాశరీరమును, జర్జరీభూతమగునట్లు పొడువరాదా!! నిష్కారణము నాపతినేల తలదీయవలయును. నా హృదయకుసుమము నేల నలిపివేయవలయును. నా ప్రాణపతి తనకేమి విరోధి. తనకేమి యపకారముచేసినాడు. ఒకవేళ నేను దోషినే కావచ్చును. నాపైకత్తిగట్టవచ్చును. నాయారధనా దైవముపై నీతివియత్యాచారమునకేమైన యర్ధమున్నదా! నాతప్పునకు నాదైవమునకు శిక్షయా! నా కొరకు, నా ప్రాణసఖుని, నా సౌందర్యాధిదేవతను పొరిగొనుటయా! కమలా! నాహృదయము భయంకర కరాళ క్రకచ దంష్ట్రికా విదారిత మగుచున్నది కమలా! నా హృదయఫలము

గుభాలున బ్రద్దలు కాబోవుచున్నది. కమలా ! కమలా ! నాచేయి పట్టుకో, నాచేయి పట్టుకో, నన్ను కౌగలించుకో,

కమల : (కౌగలించుకొని) దేవీ !

రాజ్యశ్రీ : నా యవస్థను పోల్చుకొనిన, నీగుండె కరగి నీరై పోవుట లేదా కమలా ?

కమల : నీ యీ విషాదమును నేను భరింపజాలను.

రాజ్యశ్రీ : (చివాలునలేచి) కమలా ! నాకును విషాదము నందవలసిన పని కాన్పింపదు. భర్తృపదాను గమనలగు భారత నారీమణులకు విషాదమునకు తావెందున్నది. నేను వ్యర్థముగ చింపదనుక విగ్ర మోప హతనైతిని. ప్రణయసామ్రాజ్యమునకు పరమావధి చూచిన నాకు సంతాప పడనలసిన పనియేమున్నది. కమలా ! ఆ వంగ సామ్రాజ్యకిరీటిమును దెచ్చుకొనుము.

కమల : (నిష్క్రమించును)

రాజ్యశ్రీ : (స్వగతము) కాలయాపనముచేయక, నా భర్తను, నాదేవుని, నా జీవచైతన్యమును నేను చేరుకొనవలయును.

కమల : (శశాంకుని కిరీటముతో ప్రవేశించును) దేవీ ! యిదిగో వంగ సామ్రాజ్యము.

రాజ్యశ్రీ : భర్తృవిహీననై, పరితపించుచు- అసువుల వీడనున్న నాకీ సామ్రాజ్యమేల ? దీనిని భారత సామ్రాజ్యాధిపతికి, హర్షవర్ధనున కొసంగుము. భారత సామ్రాజ్య సౌధ నిర్మాణమునకు పునాదులు వేయుటకు, తన బావయు, సోదరియు, ఆత్మార్పణ మొనర్చిరి, దానిని పరిసమాప్తి చేయవలసిన భార మాతనిపై నున్నదని తెల్పుము, మాకై తాను పరితపించిన ధీరయగు తన సోదరి కప కీర్తి తెచ్చినవాడగునని నీరాజునకు నివేదింపుము.

కమల : నా ప్రయత్నమంతయు వ్యర్థమేయగునా, మాతా!

రాజ్యశ్రీ : నాపగను సాధించినదానవు నీవు--నేనుకాదు. నీకు కృతజ్ఞురాలను (కమలను ముద్దిడుకొని) దీర్ఘాయువు కమ్మా బిడ్డా ! ఆ శిరము నెచ్చట పారవైచితివి ? ఇటు తీసుకొనిరా.

కమల : దానితో నేమిపని ?

రాజ్యశ్రీ : పనియున్నది.

కమల : (శిరమును తెచ్చియిచ్చును)

రాజ్యశ్రీ : (శిరమును చేతపుచ్చుకొని) శశాంకా : పశుబలోన్మత్తులకును, పరదారాపహరణాసక్తులకును, ఆడు కాంక్షపిశాచావేశవశులకును, దానిపై యత్యాచారము చేయువారలకును, ఈర్ష్యావశులకును. నీకు పట్టిన గతియే పట్టునుగాక! క్రౌర్యాటోప నిరాకృతియందు మహిళా మండలి, నావలె ఆత్మార్పణ మొనర్తురుగాక !! (శిరమును కత్తిని ముందిడుకొని మోకరిల్లి) నా జీవనజ్యోతీ ! కోసలపతీ ! నా దైవతమా ! ఇదిగో శత్రూన్మూలనము గావించితిని. నీ పగ సాధించితిని. నీ పాదసేవ యొనరించుకొనుటకు నేనునూ నీ సన్నిధికి చేతెంచుచున్నాను. నీ ప్రణయబాహుపరీరంభముల నన్ననుగ్రహింపుము (అని కేశబంధము మెడకు బెట్టుకొనును)

కమల : (చేరువకువచ్చి చేతులు పట్టుకుని) అమ్మా ! అమ్మా ! ఇంత ఘోరమా ?

రాజ్యశ్రీ : బిడ్డా ! నేనెవరు ?

కమల : మహారాజ్ఞి.

రాజ్యశ్రీ : దూరముగా నిలువవలయునని, పలుకకూడదని, మహారాజ్ఞి శాసనము; పాలింపుము.

కమల : (వెనుకంజవైచి) ఇంత కఠోర శాసనమా !

రాజ్యశ్రీ : ఉస్ ! (వ్రేలితో దూరముగా నుండుమని సంజ్ఞచేయును) కమలా ! నీ యుపకారములకు కృతజ్ఞతా వందనములు. క్షమింపుము. ఇక సెలవు. (కుత్తుక బిగించుకొనబోవును)

కమల : (విముఖయై, వృక్షమునకు ముఖమునానించి, దుఃఖింపుచుండును)

హర్షుడు : (తెరలో) చెప్పుము. ఎచ్చట నున్నారు? గొంతు పిసికివైతును. చెప్పెదవా ! లేదా ? డొక్క వ్రక్కలించెదను. చెప్పు ముందు చెప్పు.

కమల : హర్షచక్రవర్తి వచ్చుచున్నారు. క్షణమాగుము, క్షణమాగుము. ఒక క్షణమాగుము. (తెరలోనికిచూచుచూ బిగ్గరగా) మహారాజా! ఇక్కడ ! ఇక్కడ ! (లోనికి పరుగెత్తును)

రాజ్యశ్రీ : ఈతని యాగమనము నాకు వేరొక పరీక్ష. కానిమ్ము. నాకీ జగత్తునందుగల ఈ ఒక్క అన్నవి కడసారి చూచుకొనుటయే మంచిది.

(ప్రవేశము : తొందరగా హర్షవర్ధనుఁడు, వెనువెంట కమల)

హర్షుడు : సోదరీ ! సోదరీ ! (అని కౌగలించుకొనబోవును)

రాజ్యశ్రీ : ఆగుము ! సార్వభౌముడవు భర్తృవిహీననగు నన్నంటరాదు. దూరముగా నుండుము.

హర్షుడు : అట్లయిన నాకా సామ్రాజ్యమే వలదు. (కౌగలించుకొని) అమ్మా ! ఏమి ఈ అన్యాయము.

విచ్చుకలమూని బాణుండు, విచ్చుకత్తి
నూని నేనును, నిర్వంక నొఱికి కొలువ
భావిభారత సామ్రాజ్య భారభరణ
పరిణతోరు భుజాగ్రవై ప్రభదలిర్ప
కిట్టి ఘోరంబునకు దెగనేల తల్లి ! ॥

రాజ్యశ్రీ : ఇదిగో శశాంకుని శిరము, పగసాధించితివి, తండ్రీ ! నాకీ లోకమున నుండవలసిన పని కాన్పింపదు. భర్తృపాద శుశ్రూషా పరతంత్రనై, త్వరాయమానమానసనై, నిష్కళంక హృదయనై నానాధుని సన్నిధికి నేను చేరుకొనుచున్నాను. అధికారకాంక్షను. సోదర వాత్సల్యమును. నన్నావేశింపజేసి, పవిత్రమగు నా ఆదర్శ మును, భగ్నమొనరింపకు. కాని మాకొక యుపకారమొనరింపుము.

నావలె వనాథయైపోయె నాసపత్ని
కోమలాంబిక, అరికృత ఘోర పరిభ

వాసలంబున నిడుమల నడరుచుండె
కష్టమనుకోక, అద్దేవికావు తండ్రి!

హర్షుడు : శత్రువుల బారినుండి కోసల రాజ్యలక్ష్మిని క్షణముక్రితమే కాపాడుకొని వచ్చితిని. తల్లీ! నామాట విను....నామాటవిను.... హర్షవర్ధనుని సోదరీవిహీన పరిక్లేశ పరిభ్రాంతుని చేయకు. నా మాట విను.

రాజ్యశ్రీ : దన్యోస్మి : మరి నాకు శలవు. (కేశబంధము కంఠమునకు బిగించుకొనును)

హర్షుడు : సోదరీ ! సోదరీ ! అమ్మా, అమ్మా !

రాజ్యశ్రీ : నాహృదయమును కలవరపెట్టకు.

హర్షుడు : కఠోరము.

రాజ్యశ్రీ : చూడజాలవు, దూరముగాపో. (హర్షుడు, కమల, వెనుదిరిగి వృక్షముల కానుకొని దుఃఖింపుచుందురు)

గ్రహవర్మ : (తెరలో) రాజా ! రాజా !! రాజా !!!

(ప్రవేశము గ్రహవర్మ, బాణుడు; గ్రహవర్మ రాజ్యశ్రీని కౌగలించుకొనబోవును)

హర్షుడు :
రాజ్యశ్రీ : } ఆఁ ! (అని ఆశ్చర్యము సూచింపుదురు)
కమల :

రాజ్యశ్రీ : (గ్రహవర్మను వారించి భయచకితయై) నాభర్త వేషమున నన్నలయింప వచ్చుచున్నావు నీవెవరు ?

గ్రహవర్మ : (పగలబడి నవ్వుచు) ఎవరు ?

బాణుడు : అమ్మా ! నీ పతి మరణించెనని యెవరుచెప్పిరి ?

కమల : ఉగ్రసేనుడు

గ్రహవర్మ : అదియా ! ప్రయత్నమదియే జరిగినది. కాని మహామంత్రులు బాణులు, నన్ను కాపాడిరి.

బాణుడు : హర్షవర్ధనా ! మనము త్వరగా అయోధ్యకుపోవలయునా ?

హర్షుడు : అపని ముగించుకొనియే వచ్చితిని.

కమల : ఈ వంగసామ్రాజ్యకిరీటము. తమ ధర్మపత్ని యార్జించినది, ధరింపుడు. (అని కిరీటము గ్రహవర్మ కొసంగును)

గ్రహవర్మ : నా ప్రణయ సామ్రాజ్యానుభవమున కంతరాయములీరాజ్యములు. నాకు వలదు; నా ప్రాణదాతలు తమరు స్వీకరింపుడు. (బాణున కిచ్చును)

బాణుడు : హర్షవర్ధనా ! (హర్షునకు కిరీటము పెట్టబోవును.)

హర్షుడు : దేవా !

బాణుడు : వలదనకుము ఇది గురువుల ఆశీస్సు (కిరీటము పెట్టును)

రాజ్యశ్రీ : (బాణునితో) బావా ! ఎట్టి కఠోర నాటకమున పాత్రలధరింప వలసివచ్చినది?

బాణుడు : రసస్నతందయు లలితము సుకుమారమునగు శృంగార నాటకమే.

గ్రహవర్మ : శశాంకుడిచ్చటికెట్లువచ్చెను ?

రాజ్యశ్రీ : మాయోపాయములన్ని మృత్యువువలె, అతని తలపట్టి ఈడ్చుకొనివచ్చినది, కమల.

హర్షుడు : కమలా !

కమల : దేవా !

హర్షుడు : నీకు కొంత రాజ్యము బహూకరింపదలచితిమి.

కమల : క్షమింపుము, రాజ్యకాంక్ష నాకులేదు.

హర్షుడు : మరిఏమికావలయును ?

కమల : (దరహసిత వదనయై, తలవంచి, బాణుని వెనుకకుబోయి నిలచును)

బాణుడు : (దరహసిత వదనుడై, ఆమె శిరోజములు నిమురుచు) ప్రణయదానముచేయుము, స్వీకరింపగలదు. మాళ్వసామ్రాజ్యము పుళిందులకు చేజిక్కినప్పుడు, యీమె తండ్రి, మాళ్వచక్రవర్తి,

ప్రాణత్యాగమొనరింపబోవుచు, ఈమెను సంరక్షింపుడని మాకర కంపియున్నాడు. ఈమెకు ప్రణయదానముచేయుము—ఈమె తండ్రి రాజ్యమును జయించితెచ్చి ఈమెకిమ్ము. (బాణుడు, కమల హస్తమును హర్షుని హస్తమున విడును)

రాజ్యశ్రీ : కమలా ! మా గాంధర్వమున నీవుపాడిన మంగళగీతిమే మరలనీతుము.

[ అ ను బ ం ధ ము - 2 ]

శ్రీ. శ్రీ. శ్రీ.



---

* పేజీ 80 లో "షష్ఠమ రంగము" అనుటకుమారు "షష్ఠరంగము" అని చదువుకొన ప్రార్థన.

# అనుబంధములు

## అనుబంధము - 1. — గ్రహవర్మ - రాజ్యశ్రీ

### సారంగ్ - త్రితాళ్

గ్రహ :— రావో.... రావో.... ప్రణయారుణ మోహనకుసుమా ॥రా॥

రాజ్య :— రావో.... రావో.... ప్రణయారుణ దినకరశీలా ॥రా॥

గ్రహ :— మంగళ మధుమయ । మంజుల రూపిణీ
ప్రేమమయీ । అర । విందా అ అ....

రాజ్య :— కెంపుల కాంతులు । వింపకురా హృది
మోహన.... తరళిత । మూ.... ర్తీ ॥రా॥

గ్రహ :— రావె విలాస విలాసిని తరళా ।

రాజ్య :— మోహన తరణీ । పావనశీలా ।

ఇద్దరూ :— నాటికి నేడా । నవోదయమూ
సుఖసమాగమ । మ అఅఅఅఅ ॥రా॥

## అనుబంధము - 2. — కమల

### తిలాంగ్ - ఏకతాళము

శారికాకీర । పరిణయవేళల ॥శా॥

శుకములు పలుకవ । కోరిక లొలయ
ప్రమదమువను కో - యిలలు కూయగా ॥శా॥

## అనుబంధము - 3. — (తెరలో చాలామంది)

### మియామల్హార్ - ఏకతాళము

మమ భారతీ - సుగుణాలవాల
సుయశోవిశాల - కామదా వరదా ॥మమ॥

జయ ! దేవి ! పూత - జగదేక మాత
విభవేందిరా ! - గుణమందిరా ! ॥జయ॥

## అనుబంధము - 4. — రాజ్యశ్రీ - గ్రహవర్మ

### యమన్ - ఏకతాళము

రాజ్య :— కుందరదన ప్రేమరసికా!.... ప్రియ.... రావో ॥కుంద॥
హాయిగ.... ఈ.... మధుమాస.... వేళ....లలో
ప్రేమసదనమెల్ల వెలుగా.... ప్రియరావో
ప్రేమసదనమెల్ల వెలుగా....

గ్రహ :— ప్రేమభరిత, మధుర మధుర హృదితో
తడబడనేలా ?.... రత్నకళలకళా !
కుందరదన ప్రణయ తరళా ! ॥ప్రేమ॥

## అనుబంధము - 5. — గ్రహవర్మ - రాజ్యశ్రీ

### సారంగ్ - త్రితాల్

గ్రహ :— ప్రణయదోలికా వీచి - ఊచివైతునా చెలీ
ఊచివైతునాచెలీ - ఊచివైతునా.... ॥ప్రణ॥

రాజ్య :— మేనపులకలెసగెను నీ - బాహులతలకాచియాచు
ప్రణయదోలికావీచి - బాహులతల కాచియాచు

ఇద్దరూ :— మేను మేను గదియజేర్చి - మనసు మనసు కలియబంచి
ప్రణయ దోలికా వీచీ - తూగిపోదమా ప్రియా !

## అనుబంధము - 6. — కమల

### యమునాకల్యాణి - ఏకతాళము

1. స్తనవినిహితమపి హార ముదారం
సామనుతే కృశ తనురివభారం
రాధికా తవవిరహే కేశవ ! ॥రా॥

2. సరసమసృణమపి మలయజ పంకం
పశ్యతి విష మివ వపుషిసశంకం ॥రా॥

3. శ్వసితపవన మనుపమ పరిణాహం
మదనదహన మివ వహతి సదాహం ॥రా॥

4. దిశిదిశికిరతి సజలకణజాలం
నయన నళిన మివ విగళితనాళం ॥రా॥

5. నయన విషయ మపి కిసలయతల్పం
కలయతి విహిత హుతాశనకల్పం ॥రా॥

## అనుబంధం - 7. — గ్రహవర్మ

### భీంపలాస్ - ఏకతాళము

వనజాసన జీవన పావనశీలా హే ! - మోహనా
మోహనా.... మోహనా.... మోహనా.... ॥వన॥

1. మునిలోక హృదయజ్యోతీ ! - పరిభూత కుటిలారాతీ !
.. ..

2. పంకజాక్షా - పతితరక్షా ! ప్రేమసంగా - హే శుభాంగా
....... శుభ అంగ.... అంగా

3. సాధనధన మునిజనతా దరిశనా హే ! - పావనా ॥వ॥



ప్రజాశక్తి ప్రెస్, [illegible], విజయవాడ.